# కందుకూరి వీరేశలింగం

రచన :

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు

సంపాదకులు :

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు



ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

KANDUKURI VEERESALINGAM
by Dr Akkiraju Ramapathi Rao

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : 1988
ప్రతులు : 2000
హక్కులు : తెలుగు విశ్వవిద్యాలయం
వెల : మూడు రూపాయలు
విగ్రహ రూపకల్పన : శ్రీ పి. ఆర్. ఎస్. పట్నాయక్
ముఖపత్ర రచన : శ్రీ సుబ్రహ్మణ్యం
అక్షరాలంకరణ : శ్రీ ఎ శేఖర్
ఫొటోలు : జనతా స్టూడియోస్

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
3-5-850, హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

ముఖచిత్ర ముద్రణ :
ది ప్రింటర్ [ఆఫ్‌సెట్]
3-6-584/హెచ్, హిమాయత్‌నగర్,
హైదరాబాదు - 500 029.



# సందేశం

నిద్రాముద్రితమైన జాతిని జాగృతం చేసి, భద్రాయిత మూర్తిగా తీర్చిదిద్దిన మహావ్యక్తుల పవిత్ర జీవిత చరిత్రలు మన చిన్నారులకు ఉత్తేజకారకాలు; ఉత్సాహప్రేరకాలు. రేపటి పౌరులైన బాల బాలికలలో మంచి నడవడినీ, గట్టి పట్టుదలనూ, కలిసికట్టుతనాన్నీ, దేశభక్తినీ, సేవాసక్తినీ, మాతృ భాషానురక్తినీ పెంపొందించడానికి ఈ రీతి రచనల ప్రచురణ ఎంతైనా అవసరం.

ఈ గ్రంథ పరంపర ప్రచురణకు రూపకల్పన చేసిన తెలుగు విశ్వ విద్యాలయం వారికి మనఃపూర్వకమైన అభినందనాలు; ఉత్తమాశయ మహితమైన ఈ ఉద్యమంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను భాగస్వామ్యం వహించిన సంస్కృతి ప్రియులకు సాహితీపరులకు కళాభివందనాలు.

హైదరాబాదు,
విభవ ఉగాది,
మార్చి 18, 1988.

'కళాప్రపూర్ణ'
**నందమూరి తారక రామారావు**
కులాధిపతి, తెలుగు విశ్వ విద్యాలయం



ఆచార్య తూమాటి దోణప్ప
ఎం.ఏ, పిఎచ్.డి, డి.లిట్.,
కులపతి,
తెలుగు విశ్వవిద్యాలయం.

# ఆముఖం

తెలుగుజాతికి మహోజ్జ్వలమైన చరిత్ర ఉంది. విశాలమైన ఈ తెలుగు నేలను ఎందరో రాజన్యులు పరిపాలించారు. మరెందరో మాన్యులు, మహనీయులు దీనిని సుస్థిరమే కాదు సుసంపన్నం గావించారు. రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా, సాహితీ సంస్కృతి పరంగా, మత సామరస్యంతో ఆంధ్ర దేశాన్ని పురోగమింపజేశారు.

పరికించి చూస్తే ఇక్కడ ప్రతి రంగంలో ఒక యుగకర్త కనిపిస్తాడు; ఒక తేజోమూర్తి దర్శనమిస్తాడు. అపూర్వమైన సాహితీ సృష్టితో తెలుగు సాహితీ మంజూషను మణి

మయం చేసిన కవివరేణ్యులు; పద సాహితీ సంపదతో తెలుగు నేలను సరస సంగీత స్వర గంగాతరంగితం చేసిన వాగ్గేయకారులు; నూతన నృత్య వైయాత్యాలు అందించిన నాట్యాచార్యులు; అనల్పకల్పనా చాతురీ మహిమతో శిల్ప ప్రాభవాన్ని అందించిన శిల్పి శేఖరులు; నాటక రంగాన్ని శిఖరాయమాణం చేసిన నటశిఖామణులు; జాతీయోద్యమాలలో నడుం బిగించి ముందుకు దూకిన వీర యోధులు; చీకటి కమ్ముకొన్న వేళ జాతి యావత్తు సుషుప్త్యవస్థలోకి జారిపోయే టప్పుడు వెన్నుతట్టి, మేల్కొలిపి, చేయూత నిచ్చి, జాతిని చైతన్య చకచ్చకితం చేసిన వైతాళికులు; తమ అమేయ మేధాసంపత్తితో, ఆధునిక విజ్ఞానశాస్త్ర సారంతో ఆంధ్ర దేశాన్ని వ్యావసాయికంగా, పారిశ్రామికంగా ప్రగతిపథంలోకి నడిపించిన విదేశీయులు, స్వదేశీయులు; మత సహిష్ణుతను పెంపు చేసిన మహా నాయకులు, చరిత్ర పురుషులు ఎందరో ఉన్నారు.

ప్రాతఃస్మరణీయులైన ఈ మహనీయుల విగ్రహాలకు రూపకల్పన చేసి సమవేదికపై

ప్రాణప్రతిష్ఠ గావించి సజీవ మూర్తులుగా 'తెలుగు వెలుగులమూర్తి నిక్షిప్త కళా ప్రాంగణం' పేరిట హైదరాబాద్‌లోని టాంక్ బండ్‌పై నెలకొల్పిన ఘనులు, యశోధనులు మన ప్రియతమ ముఖ్యమంత్రి మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు.

ఈ తెలుగు వెలుగుల జీవిత విశేషాలను అక్షరబద్ధం చేయాలని మేము సంకల్పించాం. ఇవి భావితరాలను ప్రభావితం చేస్తాయనీ, చక్కటి స్ఫూర్తి నిస్తాయనీ మా విశ్వాసం. అందుకే ఈ ప్రాంగణంలోని ప్రతి మూర్తి గురించి సరళ శైలిలో క్లుప్త చరిత్రను రచింపజేసి 'తెలుగు వైతాళికులు' పేరిట లఘు రచనలుగా వెలువరింపజేశాం. ఇందుకు తమ తోడ్పాటును అందజేసిన రచయితలకు మా కృతజ్ఞతలు. ఈ పుస్తక పరంపరకు సంపాదకులుగా వ్యవహరించి మాతో సహక రించిన శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారికి మా ధన్యవాదాలు!

తేదీ 5-3-1988,
హైదరాబాద్-500 004.

హామాటి దొణప్ప

# కందుకూరి వీరేశలింగం

## రాజమహేంద్రవరం

మనదేశంలో చరిత్ర ప్రసిద్ధిని పొందిన పట్టణాలలో రాజమహేంద్రవరం ఒకటి. పురాతనమైన నగరం కూడా ఇది. కంచి, అవంతి, అయోధ్య, ఉజ్జయిని, పాటలీపుత్రం వంటి పాతకాలపు పట్టణాలలో రాజమహేంద్రవరాన్ని కూడా చేర్చవచ్చు. ఇంగ్లీషువాళ్ళు వచ్చిన తర్వాత మనదేశంలోని పట్టణాల, ఊళ్ళ ఉచ్చారణలు మారిపోయినయ్. వారణాసి అల్లా బెనారస్ అయింది. పాటలీపుత్రం అల్లా పాట్నా అయింది. చెన్నపట్నం మద్రాసు అయింది. అట్లానే రాజమహేంద్రవరం కూడా రాజమండ్రి అయింది.

రాజమహేంద్రవరం గోదావరి నది ఒడ్డున ఉంది. భారతదేశంలోని చాలా పెద్ద నదులలో గోదావరి కూడా ఒకటి. దక్షిణదేశంలో ప్రవహించే నదులలోకెల్లా ఇది చాలా పెద్దది. ఇంచుమించుగా 15 వందల మైళ్ళు పొడుగున ప్రవహించే నది ఇది. రాజమండ్రికి నాలుగు మైళ్ళ దూరాన ధవళేశ్వరం అనే గ్రామం దగ్గర ఈ నదిపైన గొప్ప ఆనకట్ట ఉంది.

ప్రాచీనకాలం నుంచీ నదీతీరాన ఉన్న నగరాల ద్వారానే భారతదేశపు నాగరకత పెరిగింది. నాగరకత అనే పేరులోనే నగర జీవితంలో ఉండే విశేషం అది అని విశద మవుతూ ఉన్నది కదా. పూర్వకాలంలో దేశంలోని వర్తక వ్యాపారాలు గొప్ప నదులలో పడవల ద్వారానే జరుగుతూ ఉండేవి. నీటి సౌకర్యం బాగా లభించే చోటనే రాజులు తమ కోటలు కట్టుకునే వారు. నది వొడ్డున నిర్మించే కోటలను జలదుర్గాలని కూడా అనే వారు. ఇటువంటి పట్టణాలకు శత్రు భయం కూడా తక్కువగా ఉండేది. సైన్యాలతో పెద్ద నదులను దాటటానికి శత్రువులకు సాధ్యమయ్యేది కాదు. విద్య లకు, కళలకు నగరాలలో ఉండే అభివృద్ధి, ఆదరణ మరి ఇతర ప్రాంతాలలో లభించడం కష్టం. నగరాలలో అనేక వృత్తిపనివారికి కూడా చేతినిండా పని లభించే అవకాశం ఉంది. అందువల్ల రకరకాల వృత్తుల ప్రజలు పట్టణాలకు చేరుకుంటూ ఉండే వాళ్ళు. పట్టణాలు త్వరత్వరగా పెరిగి పోయేవి.

ఆంధ్రదేశంలో ప్రధానమైన నగరాలలోను, ముఖ్య పట్టణాలలోను రాజమహేంద్రవరానికి చాలాకాలం నుంచి ప్రసిద్ధి ఉంది. ముఖ్యంగా వెయ్యి సంవత్సరాల నుంచి బాగా ప్రసిద్ధికి వచ్చింది ఈ పట్టణం. క్రీస్తుపూర్వమే ఈ నగరం

మహానగరంగా ఉండేదనీ, చరిత్ర ప్రాముఖ్యం దీనికి ఉండేదనీ చరిత్రకారులు వ్రాశారు.

రాజమహేంద్రవరం గురించి తలచుకోగానే ఇద్దరు ప్రముఖ వ్యక్తులు ముందుగా జ్ఞాపకం వస్తారు. ఒకరు తూర్పు చాళుక్య మహారాజు అయిన రాజరాజనరేంద్రుడు. మరి ఒకరు నన్నయ్యభట్టు అనే మహాకవి. మహాభారతాన్ని సంస్కృతం నుంచి తెలుగులోకి తీసుకొని వచ్చిన మహాకవి నన్నయ్యభట్టుగారే. అంతకుపూర్వం శాసనాలలో తెలుగు పద్యాలున్నా మొట్టమొదట తెలుగులో మహాకావ్యం రచించటానికి పూనుకొన్న మహానుభావుడు నన్నయ్యగారే లోకానికి మేలు కలగటానికి అటువంటి మహాకావ్యరచనకు ప్రారంభించారు నన్నయ్యభట్టు అని తిక్కన సోమయాజి ఆ ఆదికవిని ప్రస్తుతించారు. నన్నయ్యకు ఆదికవి, వాగనుశాసనుడు అనే బిరుదులున్నాయి.

కాబట్టి తెలుగులో మహాకావ్యం పుట్టింది రాజమహేంద్రవరంలోనే అని తెలుస్తున్నది. ఆ కావ్యం మహాభారతం. ఆ మహాకవి నన్నయ్య. అప్పటినుంచీ కూడా రాజమహేంద్రవరం ప్రసిద్ధికెక్కుతూనే వచ్చింది. అటు తర్వాత కూడా రాజమహేంద్రవరానికి చరిత్రలో ప్రాముఖ్యం ఉంటూనే వచ్చింది.

రెడ్డిరాజుల కాలంలో కూడా ఆంధ్రదేశ చరిత్రలో రాజమహేంద్రవరం ఎంతో ప్రాముఖ్యం పొందింది. కాకతీయ మహా సామ్రాజ్యం కూలిపోయిన తర్వాత ఆంధ్రదేశం తురుష్కుల పాలన లోకి రాగా మళ్ళీ స్వాతంత్ర్యం సంపాదించటానికి ఆంధ్రదేశంలో జరిగిన ప్రయత్నంలో రాజమహేంద్రవరానికి చాలా ప్రాముఖ్యం ఉండేది. శ్రీనాథుడు రాజమహేంద్రవరం దర్శించాడు. అక్కడి రాజులవల్ల ఆదరమూ, గౌరవమూ పొందాడు.

రాజమహేంద్రవరానికి చుట్టుపక్కల కోటిపల్లి, దాక్షారామం, సర్పవరం, ర్యాలి, కోరుకొండ మొదలైన ఎన్నో చారిత్రక ప్రసిద్ధి గన్న స్థలాలున్నాయి.

ఇక ఆధునిక కాలంలో కాటన్ దొర గోదావరికి ధవళేశ్వరం దగ్గర ఆనకట్ట నిర్మింప చేయడం వల్ల గోదావరి జిల్లా అంతా పచ్చని పంటపొలాలతోను, తోటలతోనూ కళకళలాడటానికి వీలు కలిగింది. ఆంధ్రదేశంలో మొట్టమొదటి మునిసిపాలిటీ రాజమండ్రి లోనే ఏర్పాటైంది. అన్నిచోట్లకన్నా ముందు ఇంగ్లీషు పాఠశాలలు స్థాపించడం జరిగింది రాజమహేంద్రవరంలోనే. ఊళ్ళోవారు సభలూ సమావేశాలు నిర్వహించుకోవటానికి వీలుగా పురమందిరం అనేది అన్ని ఊళ్ళలో కన్నా ముందుగా రాజమహేంద్రవరంలోనే నిర్మాణం

జరిగింది. మొట్టమొదటి గ్రంథాలయం కూడ రాజమండ్రిలోనే స్థాపనమైంది. ఆంధ్రదేశంలో అతి ప్రాచీనమైన పట్టణాలలో ప్రముఖంగా చెప్పుకోదగినది రాజమహేంద్రవరం. నిన్న మొన్నటివరకు సకల విద్యలకు, సకల శాస్త్రాలకు గోదావరీ తీరం ప్రసిద్ధి పొంది ఉండేది. సంపదకు, సాహిత్యానికి, సుందర ప్రకృతికి రాజమహేంద్రవరం ఎంతో పేరు పొందింది. గ్రీసుదేశానికి వెనీసునగరం ఎటువంటిదో ఆంధ్ర దేశానికి రాజమహేంద్రవరం అటువంటిది అని తెలుగువారిలో గొప్ప పత్రికా రచయిత అయిన కోటంరాజు రామారావుగారు ఒకచోట వ్రాశారు.

బ్రిటిషు వారి పరిపాలన నుంచి స్వాతంత్ర్యం పొందటానికి ఆంధ్రదేశంలో పెల్లుబికిన ఉద్యమంలో కూడా రాజమహేంద్రవరం నిర్వహించిన పాత్ర చాలా ఉత్తేజకర మైనది. బిపిన్ చంద్రపాల్ మొదట రాజమహేంద్రవరంలో ఉపన్యాసాలు చేసినప్పుడే చిలకమర్తి లక్ష్మీనరసింహ కవి 'భరత ఖండంబు చక్కని పాడియావు అనే పద్యం చెప్పారు. ఆ పద్యం ఆంధ్ర దేశమంతా అల్లుకొనిపోయి యువకులలో, పెద్దలలో స్వాతంత్ర్య కాంక్ష రగిల్చింది. స్వాతంత్ర్యోద్యమంలో పేరు ప్రతిష్ఠలు పొందిన పెద్దలెందరో రాజమండ్రికి చెందిన వారున్నారు. సాహిత్యంలో రాజమండ్రికున్న స్థానం

నిరుపమానం. అంతేకాదు తెలుగుదేశంలో నాటక ప్రదర్శనం కూడా ముందుగా రాజమహేంద్రవరం లోనే ప్రారంభమైంది. ఆ ఊళ్ళోనూ ఆ చుట్టుపక్కలా ఎంతోమంది గొప్పనటు లుండే వారు. నాటక సంస్థలు కూడా అక్కడే మొదలు ప్రారంభ మైనాయి.

అచ్చుయంత్రాలు కుడా మొట్ట మొదట అక్కడే పని చేయడం ప్రారంభించాయి. తెలుగులో వచ్చిన మొదటి పత్రికలు అక్కడినుంచి వచ్చినన్ని మరొక చోటి నుంచి రాలేదు. తెలుగులో వచ్చిన దిన పత్రికలలో రెండోది రాజ మహేంద్రవరం నుంచే మొదలైంది. ఈ శతాబ్దంలో సాహి త్యానికిగాని, సంఘ సంస్కరణకుగాని రాజమహేంద్రవరమే ప్రధానస్థాన మైంది తొలిరోజులలో. ఇంగ్లీషు వారు మద్రాసు నుంచి కలకత్తా వరకు నిర్మించిన జాతీయ రహదారిలో రాజ మహేంద్రవరం కూడలి కాబట్టి త్వరత్వరగా అభివృద్ధి చెందింది.

భారతదేశంలోనే కాక ప్రపంచంలోనే గొప్ప చిత్ర కారుడుగా ప్రసిద్ధికెక్కిన దామెర్ల రామారావు రాజమహేంద్ర వరానికి ఎంతో కీర్తి తెచ్చారు. ఆయన ఇరవైఆరు, ఇరవై ఏడేళ్ళ చిన్నవయసుననే మరణించాడు కాని లేకపోతే భారత దేశానికి మరెంత కీర్తి తెచ్చేవాడో. బోదకాలు వ్యాధికి మందు

కనిపెట్టిన ఎల్లాప్రెగడ సుబ్బారావు పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురంలో జన్మించినా రాజమహేంద్రవరంలో చదువు కున్నాడు. భారతదేశంలో జాతీయ కాంగ్రెసు స్థాపించి నప్పుడు అందులో చురుకుగా పనిచేసిన న్యాపతి సుబ్బారావు పంతులు రాజమహేంద్రవరం వాడే. ఆయనే ఆధునిక తెలుగు సాహిత్యంలో గ్రంథ రచన పోటీలు అందరికన్నా ముందుగా నిర్వహించిన వాడు. ఆయన చింతామణి అనే సాహిత్య పత్రిక కొన్నాళ్ళు నడిపారు. ఈ పత్రికలో ఆయన నవలా రచన పోటీలు నిర్వహించారు ఏడెనిమిదేళ్ళపాటు. అందు వల్ల నవలలు రాయడానికి ప్రోత్సాహం కలిగి చిలకమర్తి లక్ష్మీనరసింహకవి వంటివారు మంచి నవల లెన్నో వ్రాశారు.

సాహసానికి, త్యాగానికి, సంస్థా నిర్మాణానికి, దేశ భక్తికి, అసహాయులను ఆదుకోవటానికి ఎంతో పేరు పొందిన గుమ్మిడదల దుర్గాబాయి వల్ల కూడా రాజమహేంద్రవరం ఎంతో ప్రసిద్ధి చెందింది.

ఆంధ్రకేసరి అని కీర్తి నార్జించిన టంగుటూరి ప్రకాశం పంతులు రాజమహేంద్రవరంలోనే ఉన్నత పాఠ శాల తరగతులు, కళాశాల తరగతులు చదువుకున్నారు. ఆయన న్యాయవాదిగా రాజమహేంద్రవరంలోనే తమ వృత్తిని ఆరంభించారు. అక్కడి మునిసిపాలిటీకి అధ్యక్షుడుగా

కూడా ఆయన కొంతకాలం పనిచేశారు. ఇంగ్లీషు సాహిత్యంలో మహా కవీశ్వరుడైన షేక్స్పియర్ రచనలను మొట్ట మొదటిసారి తెలుగులోకి తెచ్చిన కీర్తి శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారిది. ఆయన రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకుడిగా ఉండేవారు. 'భక్త చింతామణీ' అనే సంబోధనతో ఆ శతకం వ్రాసిన వడ్డాది సుబ్బరాయ కవి రాజమహేంద్రవరంలోనే పాఠశాలోపాధ్యాయులుగా పని చేశారు. 1874 నాటికే రాజమహేంద్రవరంలో 'కవిత్రయం' అని ప్రసిద్ధి కెక్కిన కవులు ముగ్గురుండేవారు. అందులో మొదటి వారు వావిలాల వాసుదేవ శాస్త్రిగారు, రెండవవారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, మూడవవారు వడ్డాది సుబ్బరాయ కవిగారు. ఈయననే వసురాయ కవి అని కూడా అనేవారు. వసురాయ కవిగారు మంచి నాటకాలు రచించడమే కాక నాటకాలలో పాత్రలు ధరించి ప్రదర్శనలలో పాల్గొనే వారు కూడా. క్రిందటి శతాబ్దం చివరి సంవత్సరాలలో రాజమండ్రిలో ఉండే పాఠశాలలు మరి ఎక్కడా ఉండేవి కావు. విద్యలకు, కళలకు, సాహిత్యానికి, సంస్కృతికి ఆంధ్రదేశంలో రాజమహేంద్రవరం ఎంతో ప్రసిద్ధి పొందింది.

ఆంధ్ర దేశంలో కల్లా ప్రాచీనమైన కళాశాల రాజమహేంద్రవరం కళాశాలే కాబట్టి ఆ కళాశాలకు తొలి రోజుల్లో

విదేశీయ విద్యావేత్తలు ప్రిన్సిపాల్‌గా పనిచేయడానికి వచ్చే వారు. అటువంటి వారిలో మెట్కాఫ్, మార్క్‌హంటర్, ఆసాల్డ్ జెన్నింగ్ కూల్డ్రే మొదలైన గొప్ప విద్యావేత్తలున్నారు. ఎంల్‌ఫాల్ మెట్కాఫ్ దొర సుమారు పాతిక సంవత్సరాలు రాజమండ్రి కళాశాలకు ప్రిన్స్‌పాల్‌గా పనిచేశారు. పదవీ విరమణానంతరం ఆయన స్వదేశమైన ఇంగ్లండు చేరుకొని అక్కడ స్వగృహం నిర్మించుకొని దానికి 'గోదావరి' అని పేరు పెట్టుకున్నాడు. రాజమండ్రి నుంచి వెదురు మొక్కలు తీసుకొని వెళ్ళి ఎంతో ప్రేమగా ఇంగ్లండులో తన ఇంట్లో పెంచుకున్నాడు. అడవి బాపిరాజు, కవికొండల వెంకట్రావు, దామెర్ల రామారావు, కూల్డ్రే దొర దగ్గర కళాశాలలో చదువుకున్నారు. ఇప్పటికి కూడా రాజమండ్రి అనగానే భమిడిపాటి కామేశ్వరరావు, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి సాహిత్యవేత్తలు వెంటనే తలపుకు వస్తారు.

## వీరేశలింగం కుటుంబం

నెల్లూరు జిల్లాలో కందుకూరు అనే ఊరుంది. ఆ ఊరే మా పూర్వీకుల స్వస్థలం అని చెప్పారు వీరేశలింగం పంతులు గారు. అయితే ఉద్యోగం కోసమో ఇతర కారణాల వల్లనో స్వస్థలాన్ని విడిచిపెట్టి వాళ్ళు ఏలూరు చేరుకున్నారు.ఆ రోజుల్లో

సంస్థానాధిపతుల దగ్గరా, చిన్న చిన్న జమీందారుల దగ్గరా ఉద్యోగాలు లభించేవి. ఆ కారణం చేత కందుకూరి వారిలో పూర్వీకులలో ఎవరో గోదావరి జిల్లాకు చేరి ఉంటారు.

కందుకూరివారు శైవ మతస్థులు. అంటే ఇష్ట దైవంగా శివుణ్ణి పూజించేవారు. వీరేశలింగం పంతులుగారికి మూడు నాలుగు తరాల పూర్వీకులైన రాజలింగంగారు, ఇంకా పూర్వులైన అమృతలింగంగారు శైవ కవులను ఆదరించి వాళ్ళ చేత గ్రంథాలు కూడా అంకితం పొందినట్లు ఆయా కవులను గూర్చి చెపుతూ వీరేశలింగంగారే కవుల చరిత్రలో వ్రాశారు.

వీరేశలింగం పంతులుగారి ముత్తాత పేరు చంద్రమౌళిగారు. ఈయన ఏలూరులో ఉండేవారు. అప్పట్లో ఆ ప్రాంతాలలో మహమ్మదీయ నవాబు లుండేవారు. వారి దగ్గర చంద్రమౌళిగారు కొలువులో ఉండేవారు.

వీరేశలింగం పంతులుగారి తాతగారి పేరుకూడా వీరేశలింగమే. ఆయన పేరే వీరేశలింగానికి పెట్టారు. తన ముత్తాతగారైన చంద్రమౌళిగారి గురించి ఒక ఆసక్తికరమైన విషయం చెప్పారు వీరేశలింగం గారు. అదేమంటే శైవులెవ్వరూ కూడా సాధారణంగా వైష్ణవుల ఇంటినుంచి ఆడపిల్లను కోడలుగా తెచ్చుకోరు. వైష్ణవులు నిలువు బొట్టు వాళ్ళు. శైవులు అడ్డ బొట్టువాళ్ళు. అయితే చంద్రమౌళిగారు మాత్రం

వైష్ణవుల ఇంటి అమ్మాయిని పెళ్ళాడారు. అని చెపుతూ నా ముత్తాత గారి దగ్గరనుంచే మా కుటుంబంలో సంస్కారాభిప్రాయాలుండే వన్నమాట అని వీరేశలింగం పంతులుగారు వ్రాశారు.

వీరేశలింగం పంతులుగారి తాతగారైన వీరేశలింగం గారు ఏలూరులోనే పుట్టినా, అక్కడనే పెరిగినా ఏలూరు నుంచి వచ్చి రాజమహేంద్రవరంలో స్థిరపడ్డారు. జమీందారుల దగ్గర ఉద్యోగం చేస్తూ బాగా డబ్బు సంపాదించారు. రాజమహేంద్రవరంలో రాజభవనం లాంటి ఇల్లు కట్టుకున్నారు. ఆ ఇల్లు ఎంత పెద్దదంటే, ఆవరణం ఎంత విశాలంగా ఉండేదంటే ఆ ఇంటి ఎదురుగా ఉండే ఐదారిళ్ళ వరసవరకు వీరేశలింగం తాతగారు కట్టించిన ఇల్లు వ్యాపించి ఉండేది. ఆయన చాలా ఆస్తి సంపాదించడం, పెద్ద ఇల్లు కట్టుకోవడం, అమితమైన భాగ్యం ఆర్జించటం చూసి ఓర్వలేక కుట్రపన్ని ద్వేషంతో వీరేశలింగం తాతగారి ఉద్యోగం పోయేట్లు చేశారట వారి బంధువులలోనే కొందరు. వీరేశలింగం పంతులుగారి తాతగారైన వీరేశలింగంగారికి పురాణాలపట్ల అభిమానం ఉండేది. సాహిత్యం పట్ల కూడా ఆసక్తి ఉండేది. ఆయన ఇంట్లో రోజూ పురాణం చెప్పించుకొని వినేవారు. భారత, భాగవత, రామాయణాలు తాటాకుల

మీద రాయగలిగిన వాళ్ళను ఇంట్లో జీతం ఇచ్చి ఉంచుకొని వాళ్ళకు భోజనం పెట్టి ఆ గ్రంథాలకు ప్రతులు రాయించుకున్నారు. కొన్ని ప్రబంధాలు కూడా తాళపత్రాల మీద రాయించు కొన్నారు తమ కోసం. ఆయన విశేషంగా దాన ధర్మాలు కూడా చేశారు. తమ ఇంట్లో రామాయాణం, భారతాలు, పురాణం చెప్పిన శాస్త్రుల వారికి కొంత భూదానం కూడా చేశారు.

వీరేశలింగం గారికి ఉద్యోగం పోయినా కలిగినంతలో సుఖంగా కాలక్షేపం చేస్తుండగా ఆయనకు ఒక పెద్ద కష్టం వచ్చి పడింది. పెద్ద కొడుక్కి పెళ్ళిచేసిన కొద్దికాలం లోనే ఇంకా కోడలు కాపరానికి రాకుండానే ఆ కోడలు చని పోయింది. కొడుకు పెళ్ళి ఎంతో వైభవంగా చేశారాయన. ఎంతో డబ్బు ఖర్చు బెట్టారు. ఆ పిల్ల కాస్తా ఆయువు ముగిసి అట్లా వెళ్ళిపోయింది. మళ్ళీ కొడుక్కు పెళ్ళి చేయాలని సంబంధాలు విచారించు కుంటున్నా రాయన. మరి ఆ దిగులు వల్లనో, బాధ వల్లనో హఠాత్తుగా ఒక రోజు రాత్రి ఆయనకు గుండె నొప్పి వచ్చి ఆయన కాస్తా కన్ను మూశాడు. ఆ కుటుంబమంతా చితికి పోయింది.

వీరేశలింగం గారికి ఇద్దరు కొడులు. పెద్ద కొడుకు పేరు వెంకటరత్నం. చిన్న కొడుకు పేరు సుబ్బారాయుడు.

ఆయనకు రాజ్యలక్ష్మమ్మ అనే చెల్లెలు కూడా ఉండేది. కాని ఆ చెల్లెలుకూడా కోడలు లాగానే చిన్నతనంలోనే చనిపోయింది. ఆ చెల్లెలికి ఒక చిన్న పసిపిల్ల ఉంది. ఆ పిల్ల పేరు పున్నమ్మ. పున్నమ్మ పసిబిడ్డగా ఉండగానే తల్లి చనిపోయి నందువల్ల ఆ పిల్లను మేనమామ, అమ్మమ్మలే పెంచారు.

వీరేశలింగం గారు చనిపోయే నాటికి ఆయన తల్లి బతికే ఉంది. ఆమె పేరు అక్కమ్మ గారు. వీరేశలింగంగారి భార్య పేరు కావమ్మగారు. కాబట్టి వీరేశలింగంగారు చని పోయేనాటికి ఆ కుటుంబంలో అత్తాకోడళ్ళు, ఇద్దరు కొడుకులు వెంకటరత్నం, సుబ్బారాయుడు, మేనగోడలు పున్నమ్మ ఉన్నా రన్నమాట. వెంకటరత్నంగారికి మళ్ళీ పెళ్ళి జరిగింది. అన్న గారి కన్నా తమ్ముడు నాలుగైదేళ్ళు చిన్నవాడు. అన్నకు ఇరవైఅయిదేళ్ళు ఉంటే తమ్ముడికి ఇరవై ఏళ్ళున్నాయి. తల్లి లేని పిల్ల అనే గారాబంతో పెంచారు పున్నమ్మను మేన మామ, అమ్మమ్మలు. అందువల్ల ఆ పిల్లను తమ రెండో కొడుకు సుబ్బారాయుడికే ఇచ్చి పెళ్ళి చేసి తమ కోడలుగా చేసుకున్నారు వీరేశలింగం గారు.

వీరేశలింగంగారు చనిపోయిన తర్వాత ఆ కుటుంబం గడవటం కష్టమై పోయింది. వెండి బంగారు నగలు, ఇంట్లో నిలవచేసి ఉంచిన కలప మొదలైనవి అమ్ముకొని కొన్నాళ్ళు

కాలక్షేపం చేశారు. ఆ తర్వాత ఉద్యోగం కోసం ఎంతగానో ప్రయత్నించగా అన్నగారికి పిఠాపురం సంస్థానం లోనూ, తమ్ముడైన సుబ్బారాయుడు గారికి కాకినాడలోని కలెక్టరు కచేరీ లోనూ ఉద్యోగాలు దొరికాయి.

పున్నమ్మ,సుబ్బారాయుడు గారలు కాకినాడలో కాపురం పెట్టారు. ఆ కాలంలో సర్వసాధారణంగా భూతాలపట్ల, దయ్యాలపట్ల అందరికీ భయం ఉండేది. చచ్చిపోయిన తర్వాత కొందరు పురుషులు, కొందరు స్త్రీలు దయ్యాలవుతా రని అటువంటి వాళ్ళు బతికున్న వాళ్ళను పట్టి వాళ్ళకు అనేక జబ్బులు, చీకాకులు, భయాలు కలగ జేస్తారనీ ప్రజల్లో నమ్మకం ఉండేది.

సుబ్బారాయుడుగారి భార్య అయిన పున్నమ్మగారికి కూడా ఇటువంటి పిచ్చి నమ్మకం ఉండేది. తాతగారైన వీరేశలింగంగారు బతికి ఉన్న రోజుల్లోనే ఎన్ని వైద్యాలు చేయించినా ఆమెకు ఆ జబ్బు నిమ్మళించింది కాదు. ఒక దయ్యం వదిలిపెట్టగానే ఇంకో దయ్యం వచ్చి పట్టుకున్నదని భ్రమపడుతూ ఆమె చాలా బాధ పడుతూ ఉండేదట. ఎప్పుడూ ఏదో అనారోగ్యంతో మానసిక వ్యాధితో బాధ పడిపోతూ ఉండేది కాబట్టి ఆమె చాలా బలహీనంగా కూడా ఉండేదట. ఇంతలో ఆమె గర్భవతి అయి పురిటికి రాజమహేంద్రవరం

వచ్చింది. అమ్మమ్మ, అత్తమ్మ రాజమహేంద్రవరంలోనే ఉన్నారు. రాజమహేంద్రవరంలో అయితే విశాలమైన పెద్ద ఇల్లు, బంధు బలగం కూడా ఆసరాగా ఉంటుంది. పురుడు దగ్గర పడుతున్నదనగా కూడా ఆమెకు ఏవేవో బాధలు కలుగుతూనే వచ్చాయి.

నెలలు నిండి పున్నమ్మ ప్రసవించింది. మగపిల్లాడు పుట్టాడని ఇంటిల్లిపాదీ సంబర పడ్డారు. ఆ కుటుంబంలో ఇరవై పాతికేళ్ళుగా మగపిల్లలే పుట్టలేదు. పున్నమ్మ పుట్టిన తర్వాత ఆ ఇంట్లో పురుళ్ళే రాలేదు. తాతగారంత కీర్తి ప్రతిష్ఠ లార్జించాలనీ, తాతగారి పేరు నిలపాలనీ శిశువుకు వీరేశలింగం అనే పేరు పెట్టారు. పిల్లవాడు పుటకతోనే చాలా బలహీనంగా పుట్టాడు. పురిట్లోనే దగ్గు పట్టు కున్నది. ఇంట్లోవాళ్ళందరికీ ఆ పసివాడంటే ప్రాణం. ఆరు నెలలు గడిచాయో లేదో ఆ పిల్లాడికి మశూచికం సోకింది. ఇంట్లో వాళ్ళందరి ప్రాణాలు తల్లడిల్లి పోయినాయి. ఎట్లానో గండం గడిచింది. ముఖం మీద మాత్రం కొన్ని మచ్చ లేర్పడ్డాయి.

ఏడాది దాటిం తర్వాత పిల్లాడికి బాగా ఆరోగ్యం చిక్కిన తర్వాత కాపురానికి మళ్ళీ కాకినాడ వచ్చింది పున్నమ్మ పిల్లాణ్ణి ఎత్తుకుని. అమ్మమ్మ తనతోపాటే వచ్చింది. కాకినాడ దగ్గరే కాబట్టి అత్తమ్మను తాను వెళ్ళి చూడటమో, లేకపోతే ఆమె వచ్చి మనవణ్ణి చూసి మురిసిపోవటమో జరుగుతుండేది.

రోజులు ఒక్కలాగే జరగవు ఎప్పుడూ. కష్టసుఖాలు కావడి కుండల వంటివి.

వీరేశలింగానికి నాలుగో యేడు జరుగుతున్నది. పెదతండ్రి వెంకటరత్నంగారికి పిల్లలు పుట్టలేదు. ఆయనకు పసి వీరేశలింగ మంటే పంచ ప్రాణాలూను. ఏమాత్రం వీలున్నా వచ్చి పిల్లాణ్ణి చూసిపోతూ ఉండేవా రాయన. నిజానికి తండ్రి కన్నా పెదతండ్రి దగ్గరే చనువు వీరేశలింగానికి. పెదనాయన్ను ఆయన బాబయ్య అనేవారు. ఆయన దగ్గర వీరేశలింగానికి ఎంతో మాలిమి.

కాకినాడలో సుబ్బారాయుడు గారికి ప్రమాదకరమైన జబ్బు చేసింది. ఆ జబ్బు నయం కాలేదు. ఆయన మరణించారు. అప్పుడు వీరేశలింగానికి పూర్తిగా నాలుగేళ్ళ వయసు. పొరుగింట్లో ఆడుకోవటానికి వెళ్ళినవాడు వచ్చిచూస్తే ఇంట్లో ఏడుపులూ పెడబొబ్బలూను. బిక్కమొహం వేశాడు. పెదతండ్రి ఎత్తుకొని ఎంతో సముదాయించాడు.

కాకినాడతో సంబంధం తీరిపోయింది కాబట్టి కుటుంబం అంతా రాజమండ్రి చేరుకుంది. తండ్రిలేని పిల్లవాడు. కుటుంబానికంతా దిక్కు. వంశాంకురం. నాయనమ్మ, తాతమ్మలకు కంట్లో దీపం. వేంకటరత్నంగారు కూడా రాజమండ్రికే తమ ఉద్యోగం బదిలీ చేయించుకున్నారు. ఆయనకు వేరే ఊరు

బదిలీ అయితే అక్కడికి వీరేశలింగాన్ని తీసుకొని వెళుతుండే వారాయన. బిడ్డను చూడకుండా ఆయన ఉండలేకపోయే వారు. ఒకసారి పెదతండ్రి పనిచేస్తున్న ఊరికి పాలకీలో ప్రయాణమైపోతూ ఉండగా తన తల్లీ, పెదతల్లీ చెరొక వైపు కూర్చుని ఉండగా మధ్యలో వీరేశలింగాన్ని కూచోబెట్టారు. పాలకీ మోస్తున్న బోయీలు ఒక కాలవ దాటుతుండగా నీళ్ళు తగలకుండా పాలకీని కొంచెం పైకి ఎత్తినప్పుడు అందులోంచి దొర్లి వీరేశలింగం కాలవలో కొట్టుకపోతుండటం చూసి ఒక బోయీ వెళ్ళి ఆ పిల్లాణ్ణి రక్షించాడు.

మళ్ళీ రాజమండ్రి వచ్చిన తర్వాత ఐదో యేడు రాగానే అక్షరాభ్యాసం చేసి వీథిబళ్ళో వేశారు వీరేశలింగాన్ని.

## బడిచదువులు - పెళ్ళి పేరంటాలు

ఆ రోజుల్లో ఊళ్ళో ఏ దేవాలయం లోనో లేదా ఎవరి ఇంటి వీథి అరుగు మీదనో పదిమంది పిల్లలను చేర్చుకుని ఉపాధ్యాయుడు చదువుల బడి నడుపుతూ ఉండేవాడు. అందుకే అటువంటి బడికి వీథిబడి అని పేరు వచ్చింది. వీరేశలింగంగారి ఇంటికి దగ్గర్లోనే వేణుగోపాల స్వామి ఆలయం వుంది. ఆ గుళ్ళో పులిపాక అప్పన్నరాజుగారనే ఆయన ఒక వీథిబడి పెట్టుకుని కాలక్షేపం చేస్తుండేవారు. అక్షరాభ్యాసం ఇంట్లోనే చేసి వెంకటరత్నం గారు వీరేశ

లింగాన్ని యీ బళ్ళో చేర్పించారు. అమ్మిరాజుగారికి పెదవి మీద చీలిక ఉండి నోరు తొర్రిగా ఉండేది. అందువల్ల ఆయన మాటలు ముక్కు మాటలుగా ఉండేవి. ఆ బళ్ళో ఉపాధ్యాయుడి తొర్రినోటి మాటలు బుడుత వీరేశలింగానికి వినోదంగా ఉండేవి. ఆయన్ను అనుకరిస్తూనూ, వెక్కిరిస్తూనూ, ఇతర పిల్లలకు అయ్యవారి మాట లిట్లా ఉంటాయి అని చూపుతూనూ తనూ ముక్కు మాటలు నేర్చుకున్నాడు. క్రమంగా కొద్ది రోజుల్లోనే ఆ మాటలే అలవాటైనాయి. ఇంటి దగ్గర ముక్కుధ్వనితో కలిపి మాట్లాడినప్పుడల్లా పెదతండ్రి వీరేశలింగం ముక్కు నలిపి అట్లా మాట్లాడవద్దని మందలించేవారు.

పులిపాక అమ్మిరాజుగారి దగ్గర ఎంతోకాలం చదువుకునే అదృష్టం కలగలేదు వీరేశలింగానికి. ఇంతలో ఆ అయ్యవారు కాలం చేశారు. అందువల్ల ఆ బడి మూసేశారు. ఆ తర్వాత వీరేశలింగం సోమరాజుగారి బళ్ళో చేరాడు. ఈ బడి వాళ్ళింటికి చాలా దగ్గరగానే ఉండేది. తిరుమెళ్ళవారి ఇంట్లో ఉండేది. ఈ వీథిబడి అయ్యవారికి గూని ఉండేది. అందువల్ల ఈయన్ను గూని సోమరాజుగారు అనేవారు. సోమరాజుగారు భారతం చదివి అర్థం చెప్పగల సమర్థుడు. అమ్మిరాజుగారికంటే తన బడిపిల్లలకు పై తరగతుల చదువు కూడా చెప్పగలిగినవాడు.

ఆ రోజుల్లో సంస్కృతం కూడా చిన్న తరగతులలో నేర్పించేవాళ్ళు. వీరేశలింగం సోమరాజుగారి బళ్ళో బాల రామాయణం, ఆంధ్రనామ సంగ్రహం, అమరం మొదలైన గ్రంథాలు చదివాడు. అమరం అంటే సంస్కృత నిఘంటువు. అర్థంతో సహా ఈ పుస్తకాలు అప్పజెప్పాడు వీరేశలింగం. అటుతర్వాత పోతనగారి భాగవతంలోని రుక్మిణీ కళ్యాణం చదివించారు పంతులుగారు వీరేశలింగంచేత. ఆ తర్వాత సుమతి శతకం, కృష్ణ శతకం వల్లె వేయించారు. ఆ రోజుల్లో వీథిబడి చదువు ఇంతటితో అయిపోయేది. అంటే తెలుగు చదువు అయిపోయినట్లే నన్నమాట. ఇంకా పెద్ద చదువులు చదవాలంటే ఇంగ్లిష నేర్పించే పాఠశాలల కన్నా పోవాలి లేదా ఏ కంచికో కాశీకో పోయి, లేదా ఏ కాశీ పండితుణ్ణో ఆశ్రయించి చదువుకోవాల్సి ఉండేది. వీరేశ లింగాన్ని పొరుగూళ్ళకు పంపించటం పెద తండ్రికి, నాయ నమ్మకు ఇష్టం లేదు. అప్పటికి వీరేశలింగానికి పదకొండు, పన్నెండేళ్ళ వయస్సు. ఆ రోజుల్లో ఏదైనా చిన్న ఉద్యోగం సంపాదించాలంటే ప్యాసు కావల్సిన పరీక్ష లేవీ ఉండేవి కావు. తాలుకా కచేరీలోనో, కోర్టులలోనో ఎవరినైనా ఒక అధికారిని ఆశ్రయించి రెండేళ్ళో మూడేళ్ళో ఆయన దగ్గర జీతం భత్యం లేకుండా పని నేర్చుకుంటే ఆయన సిఫార్సుమీద అట్లా పని నేర్చుకున్న వ్యక్తికి ఉద్యోగం దొరికేది. 'దీనిని ఉమ్మేదువారీ'

అనేవాళ్ళు. అంటే ప్రతిఫలం లేకుండా పని నేర్చుకోవడం అని అర్థం. దీన్నే ఇంగ్లీషులో 'వాలంటరీ' అనేవారు.

వీరేశలింగం తెలుగు బాగా చదివాడు. వీధిబడిలోనే సామాన్య స్థాయిన లెక్కలు నేర్చుకున్నాడు. అందువల్ల సర్కారీ ఉద్యోగం కావాలంటే 'వాలంటరీ' చేయాలి. అందువల్ల రాజమండ్రిలో వాళ్ళ వీధిలోనే ఉండే పోతరాజు రఘు రామయ్య అనే ఆయన వద్ద 'ఉమ్మేదువారీ'గా చేరాడు వీరేశలింగం. ఈ రఘురామయ్యగారు తాలుకా కచేరీలో గుమాస్తాగా పనిచేస్తూ ఉండేవారు ఆరోజుల్లో. ఆయనతో పాటు తాలుకా కచేరీకి పోయి పని నేర్చుకుంటూ ఉండేవాడు వీరేశలింగం.

ఇంతలో భారతదేశంలో సిపాయి తిరుగుబాటు సంభవించింది. ఇంగ్లీషు వాళ్ళు ఈ తిరుగుబాటును అణచి వేశారు. కుంఫిణీప్రభుత్వం పోయి సీమలో ఉన్న రాణిగారే భారత దేశ పరిపాలనాధికారం స్వీకరించింది. ఇట్లా ఇంగ్లండులో ఉన్న ఇంగ్లీషు ప్రభుత్వమే భారతదేశం పరిపాలించే అధికారం తీసుకున్న తర్వాత ప్రభుత్వోద్యోగాల్లో ప్రవేశించ దలచుకున్నవారికి చిన్న చిన్న పరీక్షలు ఏర్పాటు చేయడం, ఆ పరీక్షలలో పాసైనవారిని నేరుగా ఉద్యోగాల్లోకి తీసుకోవడం జరిగింది. పరీక్షలకి కూచోవాలంటే ఇంగ్లీషులో తగు

మాత్రం పరిజ్ఞానం కావలసి వచ్చేది. అందువల్ల పన్నెండేళ్ళ వయసున వీరేశలింగం రాజమండ్రిలోని ప్రభుత్వపాఠశాలలో ఇంగ్లీషు నేర్చుకోవటానికి చేరాడు.

ఇంగ్లీషు నేర్చుకోవడానికి జిల్లా ఉన్నత పాఠశాలలో ప్రవేశించినప్పటికీ పుష్టిగా బలంగా ఆరోగ్యంగా ఉండేవాడు కాడు. సన్నగా పూచిక పుల్లలాగా ఉండేవాడు. పెద్దగాలి వస్తే ఎగిరిపోయేట్లుండేవాడు. నాయనమ్మ, తాతమ్మ అతి గారాబం చేసేవాళ్ళు. ఇరుగుపొరుగు పిల్లలతో ఆటలకు పంపితే ఆ ఆటల్లో ఏం కజ్జాలు వస్తాయోననీ, దెబ్బలాడుకుంటారేమో ననీ ఇల్లు కదలనిచ్చేవాళ్ళు కారు. క్లాసు పాఠాలు క్లాసులో శ్రద్ధగా వినేవాడు వీరేశలింగం. ఆ తర్వాత ఒక్కసారి ఇంటిదగ్గర చదవగానే ఆ పాఠాలన్నీ నోటికి వచ్చేసేవి. ఇంట్లో తాను తప్ప మరి ఇతర పిల్లలు ఎవరూ లేకపోయిరి. అందువల్ల వీరేశలింగం తాతమ్మ దగ్గరకు వెళ్ళి కబుర్లు ప్రారంభించేవాడు. అక్కమ్మగారు కాలు విరిగి మంచం పాలైంది. అందువల్ల ఆమెకు కూడా పొద్దుపొయ్యేది కాదు. మునిమనవడు వీరేశలింగం అంటే ఆమెకు పంచప్రాణాలూ. ఆమె వీరేశలింగానికి తన చిన్నప్పటి సంగతులు, కథలు పూసగుచ్చినట్లు చెపుతూ ఉండేది. వీళ్ళిద్దరూ ఇట్లా కబుర్లలో, కథల్లో పడటంచూస్తే తల్లి పున్నమ్మ వీరేశలింగాన్ని

కోప్పడుతుండేది. అందువల్ల పుస్తకం తెరచి చదువుతున్నట్లు నటిస్తూనో, లెక్కలు చేస్తున్నట్లుగా నటన చేస్తూనో తాతమ్మతో కబుర్లు పెట్టుకొనేవాడు వీరేశలింగం.

అప్పటి ఆచారం ప్రకారం ఆయనకు 7వ ఏడు రాగానే ఒడుగు చేశారు. అంటే గాయత్రీ మంత్రోపదేశం జరిగింది. చిన్నతనంలో వీరేశలింగానికి ఉపవాసాలన్నా, జపతపాలన్నా చాలా నమ్మకం ఉండేది. ప్రతిరోజూ ఆయన గుడికి వెళ్ళేవాడు. పెదతండ్రికి మునసబు కోర్టులో ఉద్యోగం వచ్చి ఆయన ఎప్పుడూ పొరుగుళ్ళలోనే ఉండేవాడు. కాబట్టి వీరేశలింగానికి ఇంట్లో ఎంతో స్వేచ్ఛ లభించింది. పొద్దుపోవటానికి కొంతా, సహజంగా తెలుగు కావ్యాల పట్ల ఉండే ఆసక్తితో కొంతా ఇంట్లో అటకలమీద ఉన్న తాటాకు గ్రంథాలు కిందికి దించి ఒక్కొక్కటే చదవడం సాగించాడు. ఆ గ్రంథాలలో వర్ణించిన మహర్షుల తపోబలం, వాళ్ళ ప్రభావాలు చూసి ఎప్పటికైనా ఇటువంటి మహత్తులు సంపాదించాలని ఆలోచనల్లో మునిగిపోయేవాడు బాల వీరేశలింగం. భారతం భాగవతాలు కూడా అవలీలగా చదివి చిన్నతనంలోనే అర్థం చేసుకొనేవాడు.

పాఠశాలలో చదువులో ఆయనే ఎప్పుడూ ప్రథముడుగా ఉండేవాడు.

ఇంటిదగ్గర పాఠాలు సరిగా చదవటం లేదు, పిల్లవాణ్ణి అదుపులో ఉంచండి అని తల్లి పాఠశాలకు పోయి పంతులు గారితో చెప్పుకొంటే, మీ పిల్లవాడే అందరికన్నా చదువులో ఫస్టున ఉన్నాడమ్మా అని వాళ్ళు చెప్పేవాళ్ళు.

ఆ రోజుల్లో ఆడపిల్లలకు ఎనిమిది తొమ్మిదేళ్ళకే పెళ్ళి చేసేవాళ్ళు. అందుకోసం ఆడపిల్ల తల్లిదండ్రులు తమ పిల్లలకు ఐదారేళ్ళు రాగానే తగిన సంబంధంకోసం ఎంతో ఆరాటపడేవాళ్ళు. మగపిల్లవాడి తల్లిదండ్రులుకూడా ఎవరైనా తమ ఇంటికి వచ్చి మీ అబ్బాయికి పిల్ల నిస్తామంటే సంతోష పడేవాళ్ళు కాని గొంతెమ్మ కోర్కెలు కోరేవాళ్ళు కారు. వీరేశ లింగానికి పదమూడో ఏడు జరుగుతుండగానే పెళ్ళి సంబం ధాలు రావడం మొదలైంది.

వీరేశలింగం పెదతండ్రి వెంకటరత్నంగారు, తల్లి పున్నమ్మగారు ఆలోచించి రాజమండ్రికి చాలా దగ్గర్లోనే ఉన్న కాతేరు అనే ఊళ్ళో ఒక సంబంధం నిశ్చయించారు. ఆ పిల్లకి ఎనిమిదేళ్ళ వయసు. పేరు బాపమ్మ. ఇంట్లోవాళ్ళు ముద్దుగా పాపాయి అని పిలుచుకునే వాళ్ళు. అప్పటి ఆచారాన్నిబట్టి పెళ్ళికూతురు పెళ్ళికొడుకును గానీ, పెళ్ళికొడుకు పెళ్ళికూతు రిని గానీ ముందుగా చూడాలని పట్టుపట్టలేదు. అద్దంకి పట్టాభి రామయ్యగారి కూతురు బాపమ్మ. అయితే పావం ఆ పిల్లకు

చిన్నతనంలోనే తల్లి చనిపోయింది. 'తల్లిపోతే మేనమామే దిక్కు' అని సామెత ఉంది. కాతేరు కరణం వెన్నేటి వెంకట రత్నంగారు బాపమ్మకు మేనమామ. మేనమామే ఆ పిల్లను చిన్నప్పటినుంచీ పెంచారు. మేనమామకు వేరే సంతానం లేదు. అందువల్ల కడుపున పుట్టిన సంతానం కన్నా ఇంకా ముద్దు మురిపాలతో బాపమ్మను పెంచుకున్నారు వెంకటరత్నం దంపతులు. పల్లెటూరే అయినప్పటికీ ఆ బిడ్డమీద ప్రేమతో ఆమెకు తెలుగు చదువు కూడా చెప్పించారు. ఆ కుటుంబానికి అక్కడ ఒక్కతే పిల్ల, ఈ కుటుంబానికి ఇక్కడ ఈయన ఒక్కడే పిల్లవాడు. ఆ అమ్మాయికి ఎనిమిదేళ్ళు నిండి తొమ్మిదో ఏడు జరుగుతున్నది. ఇక్కడ ఈ పిల్లవాడికి పన్నెండేళ్ళు నిండి పదమూడో ఏడు జరుగుతున్నది. పెళ్ళి చాలా ఘనంగా చేయాలని రెండు పక్షాలవారు సంబరపడ్డారు. ఆ రోజుల్లో వేశ్యల ఆట పాటలు, సంగీత కచేరీలు పెళ్ళి వేడుకలలో భాగంగా ఉండేవి. ఆ వేడుక లేకపోతే పెళ్ళివాళ్ళను బీదవాళ్ళుగానో లేదా పిసినారివాళ్ళు గానో ఈసడించుకునే వాళ్ళు ఊళ్ళో వాళ్ళు. అందువల్ల ఇటు కందుకూరి వెంకట రత్నంగారూ, అటు వెన్నేటి వెంకటరత్నంగారు కూడా తమ తమవైపు ప్రత్యేకంగా వేశ్యల గానా బజానాలు అంటే ఆట పాటల వేడుకలు ఏర్పాటు చేశారు. పెళ్ళికొడుకుచేత, పెళ్ళి కూతురుచేత రుక్మిణీ కళ్యాణం పద్యాలు పాడించి రెండు వైపుల వాళ్ళూ ఎంతో ఆనందించారు.

ఈ విధంగా పదమూడేళ్ళైనా నిండ కుండానే విద్యార్థి వీరేశలింగం ఒక ఇంటివాడైనాడు. గృహ ప్రవేశానికి బాపమ్మ అత్తారింటికి వచ్చినప్పుడు పున్నమ్మగారికి కోడలు పేరు మార్చాలని కోరిక కలిగింది. ఆ అమ్మాయి పేరు బాగుండక కాదు. తన తల్లి పేరు పెట్టి పిలుచు కోవాలని ఆ కోరిక. తన తల్లిపేరు రాజ్యలక్ష్మి. అందువల్ల పున్నమ్మగారు తన కోడలి పేరు రాజ్యలక్ష్మి అని మార్చివేసింది.

ఐదు రోజుల పెళ్ళి ఘనంగా జరిగింది. పిండి వంటలు తింటూ, అందరూ తమను ముద్దు చేస్తుంటే సంబరపడిపోతూ ఆనందించారు బాలవధూవరులు.

కొడుకు పెళ్ళి జరిగింది. కోడలు వచ్చింది. అంతా బాగానే ఉంది. కాని తోడికోడళ్ళ మధ్య మనఃస్పర్థలు అంత కంతకూ హెచ్చాయి. పాపం వెంకటరత్నంగారికి ప్రతిరోజూ ఆ తోటికోడళ్ళ తగవులు తీర్చలేక తలప్రాణం తోకకు వచ్చినంత పనయ్యేది. ఇటు చూస్తే తన మేనత్త కూతురు మరదలు. అటు చూస్తే కట్టుకున్న ఇల్లాలు. తనకు బహిః ప్రాణం వీరేశలింగం. వేరు కాపరాలు పెట్టంది తోడికోడళ్ళ మధ్య కలహాలు అణగేట్లు కనపడలేదు ఆయనకు. అందువల్ల కుటుంబపు సొత్తు రెండు భాగాలు చేసి ఎంతో దుఃఖ పడుతూ వీరేశలింగాన్ని తల్లినీ వేరుగా వండుకోవల్సిందని చెప్పారు వెంకటరత్నం గారు.

పున్నమ్మగారు తన కొడుకుతో వేరుగా ఉండడం ప్రారంభించింది.

## చిన్ననాటి స్నేహితులు

ఆట పాటలలో ఇతరులతో పాల్గొనటానికి ఇల్లు విడిచి బయటకు పోవటానికి అవకాశంలేదు కాబట్టి ఇంట్లో అటక మీద ఉన్న తాటాకు పుస్తకాలు చదవడం ఒక వ్యసనం చేసుకున్నాడు గదా వీరేశలింగం. ఆ గ్రంథాల్లో ఉన్న విషయాలు కల్పనలనీ, కథలనీ అనుకోక అన్నీ నిజమనే నమ్మాడు వీరేశలింగం. ఆ వయసు అటువంటింది. చిన్నతనంలో బాల బాలికలు పేదరాశి పెద్దమ్మ కథలు వింటే ఆ జరిగిన సంఘటనలు నిజంగానే జరగటానికి వీలుందా అని సందేహించరు. పశు పక్షులు మాట్లాడాయంటే నిజమేననుకుంటారు. శాపాలు, దేవతలు ప్రత్యక్షం కావడం కూడా నిజమే ననుకుంటారు. అట్లానే వీరేశలింగం కూడా పురాణాలలో చెప్పిన కథలన్నీ నిజమే ననుకున్నాడు. విశ్వామిత్రుడికీ ఇంద్రుడికీ మాటామాట వచ్చి విశ్వామిత్రుడు బ్రహ్మసృష్టికి ప్రతి సృష్టి చేశాడు కదా, అగస్త్యుడు సముద్రాన్నంతా తాగేశాడు కదా, వాళ్ళకు అటువంటి దివ్యశక్తులు తపస్సు వల్ల కదా కలిగాయి, అని వాళ్ళను గూర్చి చదివినప్పుడు తర్వాత తలుచు కున్నప్పుడు నాకు కూడా అటువంటి దివ్య

శక్తులుంటే బాగుండును అని ఆవేశం కలిగేది ఆయనకు. నేను సాధించగలను అనుకునేవాడాయన. ఎప్పుడైనా సమయం చిక్కితే ఇరుగుపొరుగు పిల్లలకు ఆయన కథలు చెప్పేవాడు. పాఠశాలలో తన జట్టు పిల్లలకు పురాణాలలోని చిత్ర విచిత్రమైన అంశాలను వివరించే వాడు. వాళ్ళంతా వీరేశ లింగాన్ని చూసి విస్తుపోయేవాళ్ళు. ఇతడెంత తెలివికలవాడు అని మెచ్చుకునేవాళ్ళు.

వీరేశలింగం వాళ్ళుంటున్న అదే వీథిలోనూ, పక్కవీథి లోనూ ఆయనకు ముగ్గురు మిత్రులున్నారు. రాచర్ల వెంకట్రామయ్య, కనపర్తి లక్ష్మయ్య, హోతా వీరభద్రయ్య అనే ముగ్గురూ ఆయనతో చాలా స్నేహంగా ఉండేవాళ్ళు. బడికి వెళ్ళేప్పుడు, బడి నుంచి ఇళ్ళకు తిరిగి వచ్చేప్పుడూ ఈ నలుగురూ జట్టుగా ఉండేవాళ్ళు.

వీరేశలింగం చెపుతున్న కథలు వినగా వినగా స్నేహితులకు హిమాలయ పర్వతాలకు వెళ్ళి తపస్సు చేసి దివ్య శక్తులు సంపాదించాలన్న కోరిక గాఢమైంది. నేనెప్పుడంటే అప్పుడు బయలుదేరటానికి మీరు సిద్ధంగా ఉండాలి అని వీరేశలింగం వాళ్ళను తరచు హెచ్చరించే వాడు. నిజానికి ఈ ముగ్గురూ కూడా వయసులో వీరేశలింగం కన్నా పెద్ద

వాళ్ళే. అంతేకాదు వీళ్ళంతా వీరేశలింగం కన్నా పై క్లాసు లలో చదువుతున్నారు. తపస్సుకు పూనటానికి మేము సిద్ధం అని వాళ్ళు వీరేశలింగంతో చెపుతూ వచ్చారు ఎప్పటికప్పుడు. ఈ స్నేహితులలో మూడోవాడైన హోతా వీరభద్రయ్య మనం ఎలాగూ హిమాలయ పర్వతాలకు వెళుతున్నాం కదా, వచ్చే టప్పుడు అక్కడినుంచి చచ్చిపోయిన వాళ్ళను బతికించే సంజీవని మూలికలను, బంగారం చేయటానికి పనికి వచ్చే వసర్లను, వేళ్ళను కూడా తేవాలని హుషారెక్కించాడు. ప్రతి రోజూ వాళ్ళ కిదే చర్చనీయమైంది. రహస్యంగా చర్చించు కునేవాళ్ళు, కూడబలుక్కొనే వాళ్ళు.

ఇట్లా కొన్ని రోజులు గడవగా వాళ్ళిక ఆగలేకపోయి నారు. ఎప్పుడెప్పుడు అని తొందరపెట్టారు వీరేశలింగాన్ని. అప్పుడిక గట్టి చిక్కు వచ్చిపడింది వీరేశలింగానికి. అంత దూర ప్రయాణం తాను చేయగలనా అనిపించింది. కాని వాళ్ళు వినేటట్లులేరు. ఒక రోజు సాయంకాలం ఆ ముగ్గురు మిత్రులూ వచ్చి ఇక ఆలస్యానికి మేం వోర్చుకోలేం. రేపే ప్రయాణం అని ఖండితంగా చెప్పారు. అప్పుడు వీరేశలింగం నేను మీతో రాలేనర్రా అన్నాడు. నీవు రాకపోయినా సరే మేము వెళుతున్నాం అని చెప్పారు వాళ్ళు.

రాచర్ల వెంకట్రామయ్య, కనపర్తి లక్ష్మయ్య, హోతా వీరభద్రయ్య మర్రోజు ఉదయం బడికి వెళ్తున్నామంటూ ఇళ్ళ

దగ్గర బయలుదేరి బడికి వెళ్ళకుండా ఉత్తరాభిముఖంగా నడక సాగించారు.

సాయింకాలం అయింది. ఈ ముగ్గురు పిల్లలు ఇల్లు చేరకపోయే సరికి వాళ్ళ వాళ్ళ ఇళ్ళలో గాభరా పడ్డారు. ఊరంతా వెతికారు. బంధువులకు కబురు చేశారు. పాపం సంజీవని ఔషధాలు, స్పర్శవేది తెచ్చుకుందామనుకున్న హోతా వీరభద్రయ్యను పిఠాపురం దగ్గరే బంధువులు పట్టుకున్నారు. ఇక అడుగు ముందుకేయకుండా కట్టుదిట్టం చేసి రాజమండ్రికి తెచ్చి తల్లిదండ్రుల కప్పగించారు. మరి వెంకట్రామయ్య, లక్ష్మయ్య ఎలాగో విజయనగరం దాకా చేరుకున్నారు. అక్కడ ఇద్దరూ తగవు పెట్టుకున్నారు. ముందుకు సాగుదామన్నా వెనక్కు పోదామన్నా లక్ష్మయ్య దగ్గర పైకం లేకపోయింది. అందువల్ల చేతికున్న మురుగు లమ్ముకొని లక్ష్మయ్య అంచెబళ్ళ మీద, కాలినడకతోనూ వెనక్కు మళ్ళాడు. వెంకట్రామయ్య ఒక్కడే ధైర్యంతో ముందుకు సాగాడు. కాని పూరీజగన్నాథం దాకా ప్రయాణం చేసే సరికి అతడికి మరి ముందుకు పోవడానికి కాళ్ళాడని పరిస్థితి ఏర్పడింది. సరే ఎట్లాగూ పుణ్యక్షేత్రం వచ్చాను కదా అని అక్కడి దేవుణ్ణి దర్శించుకొని వెంకట్రామయ్య కూడా తిరుగు ప్రయాణం కట్టాడు.

వీరేశలింగం మానసికంగా హిమాలయాల దాకా కూడా ప్రయాణం చేశాడు. స్నేహితులేమో దేహాలతోనే ప్రయాణమైనారు కాని చేరుదామనుకొన్న చోటికి చేరలేక పోయినారు. చిన్నతనంలో వీరేశలింగం ఊహాపోహలు ఇట్లా ఉండేవి.

స్కూల్లో అన్ని క్లాసుల విద్యార్థులూ ఆయన్ను అభిమానించేవారు. ప్రేమించేవారు. ఆయన మూడో తరగతి అంటే ఇప్పటి థర్డుఫారం చదువుకుంటున్న రోజులలో ఒక విశేషం జరిగింది. జబ్బుపడి ఆయన ఆరు నెలలు స్కూలుకు హాజరు కాకపోయినా తక్కిన ఆరు నెలలు మాత్రమే హాజరైనా ఆ ఏడు తరగతిలో ప్రథముడిగా ఆయన ఉత్తీర్ణుడైనాడు.

ఆ రోజుల్లో ఊళ్ళోని పెద్ద పెద్ద ఉద్యోగస్థులు పాఠశాలకు వచ్చి పిల్లలు ఎట్లా చదువుకుంటున్నారో, ఉపాధ్యాయులు ఎట్లా పాఠాలు చెపుతున్నారో తెలుసుకొనేవాళ్ళు. పిల్లల తెలివితేటలకు, బుద్ధిమంతుని తనానికి మెచ్చి బహుమానాలుకూడా ఇస్తూ ఉండేవారు. వీరేశలింగం నాలుగో తరగతిలో అంటే ఫోర్తుఫారంలో చదువుతుండగా ఒకసారి అక్కడ డిస్ట్రిక్టు జడ్జిగా పనిచేస్తున్న హెన్రీ మారిసుదొర పాఠశాల చూడటానికి వచ్చారు. ఆయన స్కూల్లో పిల్లలందరిలోకి గుణవంతుడైన పిల్లవాడు ఎవరు అని తెలుసుకోవాలని కుతూహల పడ్డాడు. వివిధ క్లాసుల్లోని పిల్లలందరినీ

చీటిమీద ఆ స్కూల్లో చదువుకుంటున్న బుద్ధిమంతుడైన విద్యార్థి ఎవరో రాయాల్సిందిగా కోరాడు.

వీరేశలింగం పైక్లాసు పిల్లలు, ఆయన కిందక్లాసు పిల్లలూకూడా ఎక్కువమంది వీరేశలింగం పేరు వ్రాశారు. కాబట్టి దొరగారిచ్చే బహుమతి వీరేశలింగానికే లభించింది. "ఏం బహుమానం ఇవ్వమంటావయ్యా వీరేశలింగం" అని దొరగారడిగారాయన్ను. పై తరగతికి కావలసిన పుస్తకాలు, ఒక నిఘంటువు కావాలని కోరుకున్నాడు వీరేశలింగం. దొర గారు చాలా సంతోషించారు. నిఘంటువుమీద తన సంతకం చేసి మరీ బహుకరించారు వీరేశలింగానికి. పుస్తకాలు కూడా కొనిపెట్టారు. వీరేశలింగం పాఠశాలలో చదువు కున్నన్ని రోజులూ ప్రతి క్లాసులోనూ ఆయనే ఫస్టుగా వచ్చే వాడు.

వీరేశలింగం వాళ్ళింట్లో నాయనమ్మా, అమ్మా, తానూ తప్ప మరి ఎవరూ లేరుకదా! ఇంగ్లీషు పాఠశాలలో చేరే సంవత్సరమే తాతమ్మ చనిపోయింది. పెదతండ్రి పెద తల్లి అమలాపురం, రాజోలు, ఏలూరు ఎక్కడికి బదిలీ అయితే అక్కడకు వెళుతూ ఉండేవారు. సెలవు వచ్చినప్పుడు అమ్మా, తానూ కూడా ఆ ఊళ్ళకు వెళ్ళి వస్తుండేవాళ్ళు. అందువల్ల తమ ఇంట్లో ఒక బంధువుల కుటుంబం వచ్చి

ఉంటామంటే సరేనన్నది పున్నమ్మగారు. ఆ కుటుంబంలో వీరేశలింగం ఈడు పిల్లవాడే ఒకడున్నాడు. అప్పుడు వీరేశలింగానికి పద్దెనిమిదేండ్లుండేవి. ఆ కుర్రాడికీ, వీరేశలింగానికీ బాగా నేస్తం కలసింది. పొద్దుపోక అప్పుడప్పుడు మిత్రులిద్దరూ చీట్లపేక ఆడటం సాగించారు. చిన్నప్పటి నుంచీ కూడా వీరేశలింగం శరీర వ్యాయామం కావలసిన ఆటల జోలి పొయ్యేవాడు కాడు. ఇంట్లోవాళ్ళుకూడా పోనిచ్చేవాళ్ళు కారు. అందువల్ల చీట్ల పేక, చదరంగం ఇటువంటి వాటితో పొద్దుపుచ్చేవాడాయన. అందువల్ల ఇటువంటి ఆటల్లో మంచి నేర్పు కూడా సంపాదించాడు వీరేశలింగం. వీరేశలింగం సాయంతో చీట్లపేకలో తాను సంపాదించాలనుకున్నాడో ఏమో ఆ మిత్రుడు చిన్నచిన్నగా వీరేశలింగాన్ని డబ్బుపెట్టి పేకాట ఆడటానికి ప్రోత్సహించాడు. ఇందులో పెద్ద తప్పేమి టని దమ్మిడీలు, కాన్లు, పెట్టి పేకాట ఆడటం సాగించాడు వీరేశలింగం. ఈ పేకాటలో వీరేశలింగానికి రెండు మూడు రూపాయలు రాబడి కూడా కలిగింది. ఏదో పొద్దుపోకకు, సంతోషానికి, వేడుకకు మొదలు పెట్టిన పేకాట జూదం స్థితికి చేరుకున్నది కొద్ది రోజుల్లోనే. మొదలు మొదలు ఇంటోనే ఆడినా తర్వాత ఈ స్నేహితుడు పేకాట జూదానికి తన ఇంకో మిత్రుడి ఇంటికి తీసుకొని వెళ్ళాడు వీరేశలింగాన్ని. అక్కడికి ఆతడి మిత్రులు ఇంకా కొంతరు వచ్చారు. ఈ విధంగా

పని పాటలు లేని జులాయిమూకతో పేకాటలో పాల్గొంటూ వచ్చాడు వీరేశలింగం. తమ ఇంట్లోనే కాపురం ఉంటున్న వాళ్ళబ్బాయి ఈ విధంగా వీరేశలింగాన్ని పేకాట వ్యసనం లోకి దింపాడు. అతడి మిత్రులను కూడా పరిచయం చేసి ఈ జూదాపాటలో మరింత ప్రోత్సాహం కలిగించాడు వీరేశలింగానికి.

ఒక రోజున తమ ఇంట్లో కాపురముండే స్నేహితుడు, అతడి ఇతర స్నేహితులూ కలసి పేకాట ఆడటానికి మంచి చోటు చూపుతామని వీరేశలింగాన్ని ఒక చోటికి తీసుకొని పోయినారు. అది ఒక వేశ్య ఇల్లు. ఆ రోజున ఒక ముసలి జూదరి వీళ్ళతో ఆటకు కూచున్నాడు. కాని మర్రోజున తన కూతురినికూడా ఆటలోకి కూర్చుండ బెట్టాడు. దీనితో వీరేశ లింగానికి ఆ కుట్రంతా అర్థమైంది. ఆ దృశ్యం చాలా వెగటనిపించింది. చెంపలు వేసుకొని మరి ఇక ఎన్నడూ పేకాట జోలికే పోలేదు. చెడు అలవాట్లు మనకు తెలియ కుండానే మనను బంధిస్తాయి. ఒకసారి వాటి వలలో పడితే మరి వదుల్చుకోవటం ఎంతో కష్టం అని తమ చరిత్ర రాసు కుంటూ యువతరానికి హెచ్చరిక చెప్పారు వీరేశలింగం.

## ఉన్నతపాఠశాలలో విద్యాభ్యాసం

సొంత ఇంట్లో తాముంటూ ఉండగా ఒక భాగం అద్దెకివ్వగా నాలుగు రూపాయలు అద్దె వచ్చేది వీరేశలింగం

గారి కుటుంబానికి. వీరేశలింగం తల్లి పున్నమ్మగారు ఎంతో తెలివిగా పొదుపుగా ఇల్లు నిర్వహించే వారు.

1861 వ సంవత్సరం వీరేశలింగం ఇంగ్లీషు పాఠశాలలో చేరాడు. ఫస్ట్, సెకండ్, థర్డ్, లోవర్ ఫోర్త్, అప్పర్ ఫోర్త్, ఫిఫ్త్ అని అప్పట్లో ఉన్నత పాఠశాల విద్యలో ఆరు తరగతు లుండేవి. ఈ ఆరో సంవత్సరం పరీక్షను మెట్రిక్యులేషన్ అనే వాళ్ళు.

ఆరోగ్యం బాగులేకనూ, జబ్బుచేసీ, చివరి తరగతి వచ్చేసరికి పెదతండ్రి చనిపోయీ మెట్రిక్యులేషన్ పరీక్ష ప్రథమ ప్రయత్నంలో ప్యాసు కాలేక పోయినాడు కాని తక్కిన అన్ని క్లాసుల్లోనూ మొట్టమొదటివాడుగా ప్యాసైనాడు వీరేశలింగం.

వీరేశలింగం ఇంగ్లీషు పాఠశాలలో చేరి చదువుకుంటున్న రోజులలో ఒక విశేషం జరిగింది. ఆయన ఒక వైపున ఇంగ్లీషు చదువుకుంటున్నా, తెలుగు కావ్యాల పట్ల ఇది వరకే రుచి మరిగి ఉండటం వల్ల తెలుగు పుస్తకాలు ఎక్కువగా చదువుతూ ఉండేవాడు. తనకు తెలిసిన పెద్దలూ, స్కూల్లో పండితులూ వసుచరిత్రను గురించి గొప్పగా చెప్పుకోవటం ఆయన విన్నాడు. ఆ పుస్తకం ఎట్లా చదవాలా అని ఆయనకు చింత పట్టుకుంది. తమ ఇంట్లో ఉన్న తాటాకు పుస్త

కాలలోనే ఉంటే ఆయన ఎప్పుడో చదివేవాడు. ఊళ్ళో ఉన్న పుస్తకాల షాపుకి వెళ్ళి వాకబు చేశాడు. అక్కడా పుస్తకం ఉంది. అయితే దాని ఖరీదు చాలా ఎక్కువ. తమ ఇంటికి వచ్చే నెలసరి అద్దె కంటే కూడా ఎక్కువ. నాలుగున్నర రూపాయలంటే ఆ రోజుల్లో సామాన్యం కాదు. అయితే ఎట్లానైనా సరే ఆ పుస్తకం చదవాలని మనస్సు పీకుతింటున్నది. తెలుగు పుస్తకాలంటే ఆయనకు ఎంత ప్రీతి అంటే కాకినాడలో ఓగిరాల జగన్నాథంగారనే కవి సుమనోమనోరంజనం అనే కొత్తతరహా ప్రబంధం రచించారని విని తాను మూడో తరగతి చదువుకుంటున్న రోజుల లోనే ఆ పుస్తకం ఎవరి దగ్గరో అరువు తెచ్చుకొని పూర్తిగా కాగితాలమీద రాసుకున్నాడాయన. అటువంటిది వసుచరిత్ర గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటూ ఉంటే ఆయనకు కుతూహలం కలగకుండా ఉంటుందా ? ఒకరోజున ధైర్యం చేసి తల్లిదగ్గరకు పోయి 'అమ్మా నాకు వసుచరిత్ర కొనిపెట్టవా?' అని గారాబంగా అడిగాడు వీరేశలింగం. మీ క్లాసు పుస్తకమా అది అని అడిగిందామె. కాదన్నాడు వీరేశలింగం. అయితే కొనిపెట్టను అని ఖండితంగా చెప్పింది తల్లి. తన దగ్గర అప్పుడప్పుడు కానీ, కానీగా పోగు చేసింది ఎనిమిదణాల సొమ్ముంది. కాని ఆ పుస్తకం వెల నాలుగు రూపాయలపైై ఎనిమిదణాలే?! ఎట్లా?

పుస్తకాల అంగడికి వెళ్ళాడు వీరేశలింగం. ఆ కొట్టు యజమాని పేరు వందిరి మహదేవుడు. ఏమండీ నా దగ్గర ఇప్పుడైతే ఎనిమిదణాలున్నాయి. అది ఇప్పుడే మీకు ఇచ్చి వేస్తాను. తర్వాత ప్రతినెలా 8 అణాలు ఇస్తాను. ఆ పుస్తకం నాకు ఇస్తారా? అని అడిగాడు. ఆ కొట్టు యజమాని కోర చూపులు చూసి నవ్వుకున్నాడు. బలే పెద్దమనిషివయ్యా, మీ ఇంటిచుట్టూ నేను తిరుగుతానా? ఆ పుస్తకం నీదే అనుకో. అయితే ఒక్క షరతు. పుస్తకం మా కొట్లోనే ఉంటుంది. నీవు ఎప్పుడు పడితే అప్పుడు ఎంతసేపంటే అంతసేపు మా కొట్లో కూచుని ఆ పుస్తకం చదువుకోవచ్చు అని చెప్పాడు. ఇది బాగానే ఉంది కాని నెలకు ఎనిమిదణాలైనా తానెట్లా సంపాదించగలడు? అని ఆలోచన కల్గింది వీరేశలింగానికి. అప్పుడు క్లాసు ఫీజు నెలకు 8 అణాలు. బడి ఎగగొట్టి ఆ 8 అణాలు పుస్తకాల కొట్టతనికి చెల్లించాలనుకున్నాడు. కాబట్టి ఆ నెల జీతం 8 అణాలు తల్లి నడిగి తీసుకొని తన దగ్గరున్న 8 అణాలు కలిపి ఒక రూపాయి ఇచ్చి రోజూ వెళ్ళి ఆ పుస్తకం చదవటం ప్రారంభించాడు. జీతం కట్టకపోతే బడికి రానియ్యరు కదా. క్లాసు పిల్లలు పున్నమ్మగారి దగ్గరకు వెళ్ళి మీ అబ్బాయి బడికి రావటంలేదని చెప్పారు. ఆమె కొడుకును అడిగింది. ఉన్నదున్నట్లు చెప్పాడు వీరేశలింగం. చిరు తిండ్లకో మరి ఇతర చెడ్డవాటికో ఖర్చు చేయకుండా పుస్తకం

కొన్నందుకు ఆమె కోపగించుకోకుండా తక్కిన ఖరీదు ఇచ్చి ఆ పుస్తకం విడిపించింది. మళ్ళీ స్కూలుకు వెళ్ళి చదువు కొన్నాడు వీరేశలింగం.

వీరేశలింగానికి ఏ విషయంలోనైనా ఆసక్తి కలిగితే, కుతూహలం కలిగితే, పట్టుదల కలిగితే దాన్ని సాధించిందాకా నిద్రపట్టేది కాదు. ఆ రోజుల్లో ప్రతి సంవత్సరం దొరతనం వారు ఒక పరీక్ష నిర్వహించేవారు. దానిని సామాన్య పరీక్ష అంటే జనరల్ టెస్ట్ అనేవారు. ఆ పరీక్ష ప్యాసైతే ఇరవై రూపాయలకు మించి నెలజీతం కల ఉద్యోగం వెంటనే దొరికేది. ఆరోజుల్లో అయితే ఈ పరీక్షకు కూచోవటానికి ఒక నిబంధన ఉండేది. పద్ధెనిమిదేళ్ళ వయసు దాటితే మాత్రమే ఈ పరీక్ష రాయవచ్చు. ఆ పరీక్షాపత్రంలో ప్రశ్నలు ఒకటి రెండేళ్ళు చూశాడు వీరేశలింగం. ఆ ప్రశ్నలు చాలా సులభంగా కనిపించాయి ఆయనకు. ఈ పరీక్షకు కూచోవాలని అనిపించిదాయనకు. అయితే అందుకు ఒక ప్రతిబంధకం ఎదురైంది. తనకు పద్ధెనిమిదేళ్ళు నిండలేదు. ఆ విషయం తనకు తెలుసు. అబద్ధమాడాల్సి వచ్చిందే అని బాధపడ్డా వైద్యుడి దగరకు వెళ్ళి తనకు పద్ధెనిమిదేళ్ళు నిండినట్లు ధ్రువ పత్రం తెచ్చుకొని ఆ పరీక్షకు దరఖాస్తు పంపించాడు వీరేశలింగం. ఆ పరీక్ష ఇంగ్లీషులోనూ తెలుగులోనూ కూడా వేర్వేరుగా ఉండేది. అయితే వీరేశలింగం తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా

ఆ పరీక్ష రాసి ఉత్తరసర్కార్ల జిల్లాలన్నిటికీ రెండోవాడుగా కృతార్థుడైనాడు. అయితే చాలా రోజులవరకు అసత్యం చెప్పి పరీక్షకు కూచున్నానే అని ఆయన బాధపడ్డాడు.

చిన్నప్పటినుంచీ తనకు న్యాయమని తోచిన విషయంలో ఆయన చాలా పట్టుదల చూపేవాడు. ఆయన తెలివితేటలు చూచి, ప్రతి క్లాసులోనూ ఫస్టు మార్కులు తెచ్చుకోవటం చూసి స్కూలు ప్రధానోపాధ్యాయుడు, ఇతర ఉపాధ్యాయులు ఆయన పట్ల చాలా అభిమానం చూపే వారు.

1967 వ సంవత్సరం ఆయన పెదతండ్రి వెంకటరత్నంగారు చనిపోయారు. అందువల్ల ఆ యేడు పరీక్షకు పోలేదు వీరేశలింగం. అయితే సామాన్య పరీక్షలో ఆయన అదివరకే కృతార్థుడై ఉన్నాడు. కాబట్టి ప్రయత్నిస్తే సర్కారు వారి కొలువు దొరుకుతుంది. పెద తండ్రి చనిపోవడం, ఇంట్లో పెద్దదిక్కెవరూ లేకపోవడం వల్ల బంధువులంతా ఆయన్ను ఏదైనా ఉద్యోగం చేసుకోవల్సిందిగా వత్తిడి చేశారు. వీరేశలింగం ఉద్యోగంలో చేరాలని ప్రయత్నించాడు. కాని ఉద్యోగంలో ఉన్న ఖాళీని వీరేశలింగం కాకుండా ఏ పరీక్ష కూడా ప్యాసుకాని వేరే వ్యక్తితో నింపడం వల్ల మరి గవర్నమెంటు ఉద్యోగానికి పోకూడదని నిశ్చయించుకున్నాడు వీరేశలింగం. తమకు బంధువులై ఉండీ వేరే అతడి దగ్గర

లంచం తీసుకొని ఆ ఉద్యోగం తనకు కాకుండా చేశాడని కోపం కలిగింది వీరేశలింగానికి.

వీరేశలింగం మెట్రిక్యులేషన్ క్లాసు చదువుతుండగా ఒక విశేషం జరిగింది. అప్పుడు పాఠశాల హెడ్మాస్టరు వైయాపురి మొదల్యారు అనేవారు. ఆయనకు ఇంగ్లీషు పాఠాలు చెప్పడం చేత కాదు. మరి క్లాసేమో పెద్ద క్లాసు. ఇంగ్లీషు పాఠాలు సరిగా తెలియకపోతే మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసు కావడం ఎట్లా ? నూటికి ఏ ఒకరో ఇద్దరో మెట్రిక్యులేషన్ ప్యాసయ్యే వాళ్ళు ఆ రోజుల్లో.

కాబట్టి వీరేశలింగమూ ఆయన స్నేహితులు కలిసి ఆలోచించి వైయాపురి మొదల్యారుగారిని ఇక్కడనుంచి బదిలీ చేసి మరో ఉపాధ్యాయుణ్ణి ఇక్కడకు రప్పించవలసిందిగా విద్యా విచారణ శాఖాధికారికి విజ్ఞాపనం పంపుకోవడానికి నిశ్చయించుకొన్నారు. ఆ విజ్ఞాపన వీరేశలింగమే తయారు చేశాడు. తన తరగతి పిల్లలందరి చేత దానిపై చేవ్రాళ్ళు చేయించాడు. కింది తరగతుల పిల్లల దస్కతులు చేయించటానికి తన స్నేహితుడైన కనపర్తి లక్ష్మయ్య కిచ్చి పంపించాడు. లక్ష్మయ్య తన తరగతి పిల్లలతో ఆ విజ్ఞాపన పత్రంపై చేవ్రాళ్ళు చేయిస్తుండగా ఎట్లానో ఈ విషయం ప్రధానోపాధ్యాయులైన వైయాపురి మొదలియారుగారికి తెలిసి ఆయన

నాలగవ తరగతికి హడావుడిగా వచ్చి లక్ష్మయ్యను చావ బాదాడు. ఆ విజ్ఞాపన పత్రాన్ని మొండ్రేటి రామచంద్రుడనే పిల్లవాడు తాను సంతకం చేసి ఇస్తానని మభ్యపెట్టి హెడ్మాస్టరుగారికి తీసుకొనిపోయి ఇవ్వటం వల్ల ఆయనకు చాలా కోపం వచ్చింది. దీనికంతా కథానాయకుడు వీరేశలింగం అని తెలిసి ఐదో తరగతి లోకి వెళ్ళి వీరేశలింగాన్ని బుద్ధిహీనుడా అని తిట్టారు హెడ్మాస్టరుగారు. వీరేశలింగానికి భరించలేని అవమానం అనిపించి ఆయన వెంటనే క్లాసు విడిచి ఇంటికి వెళ్ళిపోయినాడు. వీరేశలింగం ఎప్పుడైతే క్లాసు విడిచిపెట్టి వెళ్ళాడో పాఠశాల పిల్లలంతా మేం స్కూలుకు రాము అని సమ్మె చేశారు. ఈ లోపున వీరేశలింగం మళ్ళీ విజ్ఞాపన పత్రం తయారు చేసి కొందరి చేత సంతకాలు చేయించి మద్రాసు లోని విద్యా విచారణాధికారికి తంతిద్వారా పంపించాడు.

మద్రాసు నుంచి విచారణాధికారి రావడమూ రాజమండ్రి పాఠశాల వ్యవహారాన్ని విచారించడమూ జరిగింది. వైయాపురి మొదలియారుగారిని అక్కడనుంచి బదిలీ చేసిన తర్వాత మళ్ళీ పాఠశాల పనిచేసింది. నరసాపురం పాఠశాల ప్రధానోపాధ్యాయులైన చెంగల్వ కుప్పుస్వామిశాస్త్రిగారిని రాజమహేంద్రవరం బదిలీ చేసిన తర్వాత రాజమండ్రి పాఠశాల స్థితిగతులు చక్కబడ్డాయి.

వీరేశలింగానికి చిన్నప్పటి నుంచీ ఆత్మాభిమానం ఎక్కువగా ఉండేది. న్యాయం విషయంలో, సత్యం విషయంలో పట్టుదల ఎక్కువగా ఉండేది.మోసంచేసిన మొండ్రేటి రామచంద్రుడు రాజమండ్రిలో ఉండలేక విశాఖపట్నం వెళ్ళి చదువుకోవాల్సి వచ్చింది.

పాఠశాలలో పై తరగతులు చదువుకొంటున్న రోజుల లోనే వీరేశలింగానికి తానుకూడా పద్యాలు రాయాలని, కవిత్వం చెప్పాలనీ అభిలాష కలిగింది. ఆ రోజుల్లోనే ఆయన రెండు శతకాలు రచించారు. రాజమహేంద్రవరంలో ఉన్న మార్కండేయస్వామి పైన ఒక శతకమూ, వేణుగోపాలస్వామి పైన ఒక శతకమూ ఆయన వ్రాశారు.

వీరేశలింగం నాలుగు, ఐదు తరగతులు చదువుతున్న కాలంలో వాళ్ళ పాఠశాలకు బందరు నుంచి ఆత్మూరి లక్ష్మి నరసింహం అనే ఉపాధ్యాయుడు వచ్చాడు. హెడ్మాస్టరు తర్వాత ఉపాధ్యాయుడిగా ఆయన పని చేసే వారు. ఈయన తన శిష్యులను మిత్రులను చేర్చి సంఘంలోకి తీసుకొని రావల్సిన మార్పులను గూర్చి, మార్చుకోవలసిన అభిప్రాయాలను గూర్చి చెపుతూ ఉండేవారు. ఈ సమావేశాలకు ఐదారుగురు మిత్రులు హాజరవుతూ ఉండే వాళ్ళు. వీరేశలింగం మిత్రుడు కనవర్తి లక్ష్మయ్య కూడా వచ్చేవాడు. వీరేశలింగంగారి

ఇంట్లోనో, ఆత్మూరివారి ఇంట్లోనో, లక్ష్మయ్యగారి ఇంట్లోనో ఈ మిత్ర సమావేశాలు జరుగుతూ ఉండేవి. సరిగ్గా ఈ రోజుల్లోనే వీరేశలింగం తన మిత్రుడైన చల్లపల్లి రంగయ్య నుంచో, మరి ఇతర మిత్రుడి నుంచో, కేశవ చంద్ర సేన్ ఇంగ్లీషులో రాసిన పుస్తకాలు తెచ్చుకొని చదివాడు. అంతటితో ఆయనలో అదివరకటి విశ్వాసాలు చాలావరకు మారిపోయాయి. విగ్రహారాధనం, జపతపాలు మొదలైన వాటిలో నమ్మకం పలచబడింది. భూతాలు, దయ్యాలు మోసగాళ్ళు సృష్టించేవి తప్ప నిజం కావని గట్టి నమ్మకం కుదురుకొన్నది. భూతాలు పట్టినవాళ్ళ ఇళ్ళకు వెళ్ళి, అర్ధరాత్రుళ్ళు స్మశానాలకు వెళ్ళి జాగ్రత్తగా పరిశీలిస్తూ ఈ దయ్యాలూ భూతాలూ వట్టి బూటకమని ఆయన గట్టిగా నిర్ణయించు కున్నారు.

అప్పటికాయన వయస్సు ఇరవై ఏళ్ళు. మరి రెండేళ్ళకు ఆయన మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనాడు.

## ఉద్యోగం

ప్రభుత్వం కొలువు చేయకూడదని నిశ్చయించుకున్నాడు వీరేశలింగం. ఎందుకంటే సర్వసాధారణంగా ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం కనపడుతున్నది ఆ రోజుల్లో. అక్రమ ప్రవర్తన కూడా అంతు లేకుండా ఉండేది. మరి న్యాయవాద వృత్తిని చేపడదామా అంటే ఆ వృత్తిలో

ధర్మంగా, న్యాయంగా, సత్యంగా, ముక్కుసూటిగా మసలుకోవ టానికి అవకాశం లేదని, సాక్షులకు తప్పుడు బోధలు చేయాలని ఆయన న్యాయవాద మిత్రులు చెప్పారు. అందువల్ల న్యాయ వాద పరీక్షకు కూచుందామని మొదట్లో ఆయన ఆ పుస్తకాలు చదివినా మరి తర్వాత ఆ ఊసెత్తుకో లేదు.

ఇంతలో తాను చదువుకున్న పాఠశాలలోనే ఒక ఉపాధ్యాయుడు ఏడాది సెలవు పెట్టగా ప్రధానోపాధ్యాయు లైన చెంగల్వ కుప్పుస్వామిశాస్త్రిగారు ఆ ఉద్యోగానికి వీరేశ లింగం పేరు సిఫార్సు చేశారు. వీరేశలింగం ఆ ఉద్యోగంలో చేరారు. ఇంగ్లీషు, లెక్కలు, దేశచరిత్ర కొన్ని తరగతుల కాయన బోధించేవాడు. ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం కావటంవల్ల కాలం నెమ్మదిగా గడుస్తున్నది.

అయితే కేశవచంద్రసేన్ పుస్తకాలు చదవటం వల్ల, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారితో కలిసి మిత్ర సమావేశాలలో నీతి, భగవద్విశ్వాసము, విగ్రహారాధన, దయ్యాలు భూతాల ఉనికి విషయమై విశేషించి చర్చలు చేయడంవల్ల వీరేశలింగం భావాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. హేతువు లేకుండా దేనినీ నమ్మకూడదని ఆయన గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఇంతలో వాళ్ళింట్లో అరటిచెట్టు చివరనుంచి గెల వేయకుండా చెట్టు మధ్యలోంచి గెల వేయడం జరిగింది.

ఇరుగు పొరుగులు దానివల్ల ఏదో కీడు మూడుతుందని ఆయన్ను భయపెట్టారు. వెంటనే ఆ చెట్టు కొట్టేయించాల్సిందని సలహా ఇచ్చారు. కాని వీరేశలింగం ఎవరి మాటా వినలేదు. గెల బాగా ముదిరిన తర్వాత కాయలు కోసుకొని అప్పుడు చెట్టు కొట్టేయించాడు. అదే విధంగా ఇంట్లో దూలానికి ఒకసారి తేనెపట్టు పట్టింది. దీనివల్ల ఇంటివారికి ఏదో పీడ కలుగుతుందనీ, పూజా పునస్కారాలు చేయించి దానధర్మాలు చేయాలని చెప్పారు వీరేశలింగానికి. కాని ఆయన అటువంటి పనులేమీ చేయలేదు. జిల్లా పాఠశాల ఉపాధ్యాయుడిగా ఆయనకు నెలకు 25 రూ. లు జీతం ముట్టేది. అయితే ఒక సంవత్సరం కాగానే ఆయన ఉపాధ్యాయ ఉద్యోగం ముగిసింది. ఇంతలో కోరంగి అనే చోట ఆయనకు ప్రధానోపాధ్యాయ పదం ముప్ఫై రూపాయల జీతం మీద లభించింది. మంచిరోజనీ, శుభముహూర్తమనీ చూసుకోకుండా అమావాస్య నాడు బయలుదేరి ఆయన ఆ ఉద్యోగంలో చేరాడు.

కోరంగిలో ఆయన ఉద్యోగం చేస్తున్న రోజులలో ఒక వింతసంగతి జరిగింది. వీరేశలింగం తల్లి పున్నమ్మగారికి మొదటి నుంచీ తననేదో దయ్యమో, భూతమో పట్టి పీడిస్తున్నదనే భ్రమ ఉంటూనే ఉన్నదికదా, కోరంగిలో ఆ వ్యాధి మరింత ముదిరింది. అప్పుడు ఒక గొప్ప భూతవైద్యుణ్ణి తీసుకొనివచ్చారు వీరేశలింగంగారి దగ్గరకు ఇరుగు పొరుగువాళ్ళు.

ఆయనకు నమ్మకం లేకపోయినా తల్లి భ్రమ అయినా నివారణ మవుతుంది కదా అని వీరేశలింగం అతడి మంత్ర తంత్ర చికిత్సకు అంగీకరించాడు. కాని కొద్దిరోజుల్లోనే ఆ వైద్యం వొట్టిమోసమని ఆయనకు రుజువైపోయింది. ఆ భూతవైద్యుడి పట్ల వీరేశలింగం కఠినంగా వ్యవహరించేసరికి వీరేశలింగం తన మీద ఏదో మంత్ర ప్రయోగం చేశాడాని దయ్యాన్ని పురి కొల్పాడని దడుచుకొని ఆ భూతవైద్యుడు మంచం పట్టాడు. దీనితో మంత్రవేత్తల బండారమంతా వీరేశలింగానికి తెలిసి పోయింది.

కోరంగిలో రెండు సంవత్సరాలు ప్రధానోపాధ్యాయు డిగా ఆయన పని చేసిన తర్వాత రాజమండ్రికి దగ్గరలోనే ఉన్న ధవళేశ్వరంలో ఆయనకు పాఠశాలప్రధానోపాధ్యాయుడి ఉద్యోగం లభించింది. ఇక్కడ జీతం కూడా కోరంగిలో కన్నా ఎక్కువ. ఇక్కడి జీతం 44 రూపాయలు కాబట్టి వీరేశ లింగం ధవళేశ్వరం వచ్చాడు.

ఆ కాలంలో రెండు పత్రికలు వస్తూ ఉండేవి. ఒక పత్రిక బందరు నుంచి వచ్చేది. దాని పేరు పురుషార్థప్రదాయిని. ఇంకో పత్రిక మద్రాసు నుంచి వస్తూ ఉండేది. దాని పేరు ఆంధ్ర భాషా సంజీవని. ఈ రెండు పత్రికలతో అనేక విషయాలపై వాదవివాదాలు వెలువడుతుండేవి. ఆడవాళ్ళ

చదువుకోవాలి, అప్పుడే సంఘానికి మేలు కలుగుతుంది అని పురుషార్థప్రదాయినిలో ఎవరైనా రాయగానే, ఆడవాళ్ళు విద్యావంతులైతే సంఘం చెడిపోతుంది ఎన్నో అనర్థాలు సంభవిస్తాయి అని ఆంధ్రభాషా సంజీవనిలో రచనలు వస్తూ ఉండేవి. అట్లానే వ్యాకరణం విషయమై, పదప్రయోగం విషయమై వాదనలు వస్తూ ఉండేవి. వీరేశలింగం చదువుకొంటున్న రోజుల్లోనే రాజమండ్రిలో కాలేజి ప్రిన్సిపాలైన బారోదొరగారు ఒక పత్రిక నడుపుతూ ఉండేవారు. ఆ పత్రిక పేరు గోదావరీ ఎడ్యుకేషనిస్టు. ఇందులో ఇంగ్లీషు తెలుగు రెండు భాగాలుండేవి. తెలుగుభాగం గోదావరి విద్యా ప్రబోధిక. ఈ తెలుగు భాగంలో వీరేశలింగం తన రచనలు ప్రకటిస్తూ ఉండేవాడు. ఉన్నత పాఠశాలలో పై తరగతులు చదువుకుంటున్న రోజులలోనే ఆయన రెండు శతకాలు కూడా రాశాడు కదా. అటు తర్వాత ఇదివరకు తెలుగు కవులెవ్వరూ తొక్కని దారి తొక్కి తన గొప్పతనం చూపుకోవాలనుకున్నాడాయన. అచ్చ తెలుగు నిర్వచనమూ నిరోష్ఠ్యమూ అంటే ప ఫ బ భ మ లతో ఉండే మాటలేవీ రాకుండా ఒక కావ్యం రాయాలనుకున్నాడు. పురుషార్థ ప్రదాయినికి ఆంధ్ర భాషా సంజీవనికికూడా తన రచనలు పంపుతూ ఉండేవాడు. వాటిలో వాద వివాద రచనల్లో తానూ పాల్గొనేవాడు. ఆయన

రచించిన అచ్చ తెలుగు సభాపర్వం ఆంధ్ర భాషా సంజీవనిలో అచ్చవుతుండేది.

ఈ విధంగా పత్రికా రచనలో ఆయనకు అభిరుచి, అభిలాష ఎక్కువైనకొద్దీ తానుకూడా ఒక పత్రిక నడపాలని అనుకున్నాడు. 1874లో ధవళేశ్వరంలో పాఠశాల ప్రధానోపాధ్యాయ ఉద్యోగంలో చేరిన తర్వాత పత్రిక నడపాలనే కోర్కె ఆయనకు మరింత బలపడింది. అప్పటికే ఆయన సంగ్రహ వ్యాకరణం రచించారు. అట్లానే చిన్నయసూరి పంచతంత్ర రచనంలో విడిచిపెట్టిన సంధి విగ్రహాలు ఆయన పూర్తి చేశాడు. సంగ్రహ వ్యాకరణానికి, సంధి విగ్రహ రచనకు ఆయనకు మంచి పేరు వచ్చింది.

అయితే ఇంతలో ధవళేశ్వరంలో పాఠశాల నడుపుతున్న వారిలో ఒకరికీ వీరేశలింగం గారికీ మనఃస్పర్థలేర్పడ్డాయి. ధవళేశ్వరంలో ఉద్యోగం చేయడం కూడా ఆయనకు ఇష్టం లేక పోయింది. ఉద్యోగంలో ఉంటే కొందరిని గురించి ఉన్నదున్నట్లుగా పత్రికలో రాయడానికి వీలుండదు. ఉద్యోగం వదులుకుంటే స్వేచ్ఛగా పత్రిక నడుపుకోవచ్చు అనిపించిందాయనకు. ఆ రోజుల్లోనే రాజమండ్రి కాపురస్థులైన బసవరాజు గవర్రాజుగారితో పరిచయం కలిగింది వీరేశలింగం గార్కి. అప్పట్లో గవర్రాజుగారు రాజమండ్రి కాలేజీలో

చదువుకొంటూ వుండేవారు. కళాశాలలో ఒక చర్చా సంఘాన్ని ఆయన స్థాపించి ఆ విద్యార్థి సమాజానికి ఉపన్యాసాలు ఇవ్వా ల్సిందిగా వీరేశలింగం గారిని కోరారు. ఆ విధంగా వాళ్ళి ద్దరి మధ్యా పరిచయం ఏర్పడి అది గాఢమైత్రిగా బలపడింది. ప్రతి ఆదివారం ధవళేశ్వరం నుంచి రాజమండ్రి వెళ్ళి విద్యార్థి సంఘం చర్చల్లో పాల్గొంటూ వారికి ఉపన్యాసాలు ఇస్తుండే వారు వీరేశలింగం గారు. ఆ రోజుల్లో సంఘంలో కనవడు తున్న అక్రమాలను దుర్మార్గాలను తమ పత్రికలో వెల్లడిం చటం వల్ల వీరేశలింగం గారికి కొందరు ప్రతిపక్షులుకూడా ఏర్పడ్డారు. అందువల్ల ధవళేశ్వరంలో ఉద్యోగం మానుకొని పూర్తిగా పత్రికా నిర్వహణంలోనే తమ యావచ్ఛక్తిని విని యోగించాలని వీరేశలింగం నిశ్చయించుకొని 1876 లో రాజమండ్రి వచ్చేశాడు.

ఇదివరలో కోరంగిలో ప్రధానోపాధ్యాయుడిగా ఉంటూ ఒక పరీక్ష రాయడానికి రాజమండ్రి వచ్చినప్పుడు రాజమండ్రి కళాశాల ప్రిన్సిపాల్ మెట్కాఫ్ దొరతో పరిచయం ఏర్ప డింది వీరేశలింగానికి. అంతకు పూర్వమే మెట్కాఫ్‌దొర ఇంగ్లండు నుంచి రాజమండ్రి పాఠశాలకు ప్రధానోపాధ్యా యుడిగా వచ్చారు. ఆయన వచ్చిన తర్వాత ఆ ఉన్నత పాఠశాల కళాశాలగా అభివృద్ధి చెందింది. ఆయన తెలుగు

నేర్చుకుంటున్న రోజులలో ఆయనకు కలిగిన ఒక సందేహం ఎవరూ తీర్చలేకపోయారు. తన ప్రశ్న ఏవిటో వీరేశ లింగాన్ని కూడా అడగ్గా ప్రిన్సిపాల్ గారికి ఆయన తృప్తి కలిగే సమాధానం చెప్పగలిగాడు. అప్పటినుంచీ వీరేశలింగమంటే మెట్కాఫ్‌దొరగారికి మంచి అభిమానం కలిగింది.

1876 వ సంవత్సరంలో ధవళేశ్వరంలో ప్రధానోపాధ్యాయ పదవి వదలి పెట్టుకుని రాజమహేంద్రవరం చేరుకోగానే కళాశాలలో ఉపాధ్యాయ పదవి ఇస్తాము వస్తారా అని మెట్కాఫ్‌దొర వీరేశలింగానికి కబురు చేశాడు. అయితే ఆ ఉపాధ్యాయోద్యోగానికి అప్పుడు 25 రూపాయలు మాత్రమే నెలజీతం. ముందు వీరేశలింగం ఇష్టపడకపోయినా ఉన్న ఊళ్ళో ఉద్యోగం ఎందుకు కాదంటావని బంధువులూ స్నేహితులూ వత్తిడి చేయగా అంగీకరించి కళాశాలలో రెండో తెలుగు పండితుడిగా ఉద్యోగంలో చేరాడు. అప్పటినుంచి ఒకవైపున కళాశాలలో ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేస్తూనే ఆయన తన ఇతర కార్యక్రమాలన్నిటినీ నిర్వహించాడు. సుమారు 20 సం॥ల కాలం రాజమండ్రి కళాశాలలో ఆయన ఉపాధ్యాయ పదవిలో ఉన్నాడు. విద్యార్థులు ఆయన నెంతగానో అభిమానించి ఆయన కార్యక్రమాలన్నిటా పాల్గొనే వాళ్ళు. ఆయన విద్యార్థులకు తన క్లాసులో ఎప్పుడూ సంఘ

సంస్కరణ భావాలు బోధించేవారని ఆయన దగ్గర చదువుకున్నవాళ్ళు ఎందరో రాశారు. మొత్తం తమ జీవితకాలంలో ఆయన 25 సం॥ల కాలం కళాశాల తెలుగు పండితులుగా పని చేశారు. చివర 5 సం॥లు చెన్నపట్నంలోని ప్రెసిడెన్సీ కళాశాలలో పండితులుగా పనిచేశారు. 1904 లో పదవీ విరమణం చేసి మళ్ళీ రాజమండ్రి చేరుకున్నారు. పత్రికలు నడిపినా, నూరింటికి పైగా గ్రంథాలు రాసినా, వితంతు వివాహాలు చేసినా, బాలికా పాఠశాలలు, అసహాయ యువతీ రక్షణశాలలు నిర్వహించినా ఒకవైపున ఉపాధ్యాయ వృత్తి కొనసాగిస్తూనే సాంఘిక సేవా కార్యక్రమం, రచనావ్యాసంగం సాగించారు వీరేశలింగం పంతులుగారు.

## పత్రికాస్థాపనం

తన అభిప్రాయాలు లోకానికి తెలియజేయాలంటే తన యాజమాన్యంలో ఒక పత్రిక ఉండటం చాలా అవసరమని గ్రహించాడు వీరేశలింగం. స్త్రీలు విద్యావంతులైతే తప్ప సమాజానికి మేలు కలగదు అని ఆయన వాదించేవారు. ప్రతిపక్షంవాళ్ళు ఇందుకు విరుద్ధంగా ఆంధ్రభాషాసంజీవనిలో రాస్తూ ఉండేవాళ్ళు. అదీకాక అప్పటికే తన పద్యకావ్యాలు ఇతర పత్రికలు ప్రచురిస్తూ వచ్చాయి. తనకే ఒక పత్రిక

ఉంటే తన రచనలు ప్రకటించుకోవడం మరింత సులువుకదా అనిపించింది వీరేశలింగానికి.

1874వ సంవత్సరం ధవళేశ్వరంలోని ఆంగ్లో-వెర్నాక్యులర్ స్కూలుకు ప్రధానోపాధ్యాయుడిగా వచ్చినప్పటినుంచి ఈ కోరిక మరింత బలపడింది. తన అభిప్రాయాలను బలంగా ప్రచారం చేయటానికి పత్రిక చాలా ఉపయుక్తమైన సాధనమనుకున్నారాయన. విరివిగా ప్రతి ఊళ్ళోనూ బాలికా పాఠశాలలు స్థాపించాలని ప్రచారం చేయటం ఆయన పరమాశయం.

1874 అక్టోబర్ (ఆశ్వయుజమాసం) లో ఆయన తనదైన సొంత పత్రిక ప్రారంభించాడు. ఆ పత్రిక పేరు వివేకవర్ధని. అంటే లోకంలో వివేకాన్ని పెంచే పత్రిక అని అర్థం. ఆ రోజుల్లో రాజమహేంద్రవరంలో ముద్రణాలయం లేదు. అందువల్ల తమ పత్రిక మద్రాసు నుంచే ప్రచురించాల్సి వచ్చింది. మొట్టమొదట అరఠావు కొలతన నాలుగు పుటల్లో వెలువడేది ఈ వివేకవర్ధని. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు తమ మిత్రులే కాబట్టి ఆయనగారికి మద్రాసులో సొంత ముద్రణాలయం వుంది కాబట్టి అక్కడ తమ పత్రిక ముద్రించారు ముందు మూడు నాలుగు నెలలూ. ఆయన ప్రెస్సులో అచ్చు వేస్తుండటం వల్ల పత్రిక వెలువడటం చాలా

ఆలస్యమవుతూ వచ్చింది. అందువల్ల వేరే ప్రెస్సుకు మార్చారు వీరేశలింగం తన పత్రిక అచ్చువేయటం. మద్రాసు జార్జి టవున్‌లో శ్రీధరముద్రాక్షరశాలలో అచ్చువేయడం ప్రారంభించారు. ముఖపత్రం కాక 16 పుటల పుస్తకరూపానికి మార్చారు పత్రికను. తమ పత్రిక ఆదర్శవాక్యంగా మహాభారతంలోని "ఒరులేవి యొనరించిన, నరవరయప్రియము తన మనంబునకగుతా, నొరుల కవి యొనరింపకునికి పరాయణము పరమ ధర్మపదముల కెల్లన్" అనే నీతి వాక్యాన్ని గ్రహించారు.

ఈ పత్రిక ప్రారంభించడంలో నా ముఖ్యోద్దేశాలు రెండు అని వీరేశలింగం ప్రకటించారు. ఒకటి భాషాభివృద్ధి. రెండు దేశాభ్యుదయం. భాషాభివృద్ధికి మార్గం ఏమంటే సులభమైన శైలిలో వచనంలో వివిధ విషయాలను రాయటం. దేశాన్ని బాగుచేసే మార్గం ఏమంటే కులంలో, కుటుంబంలో, వీధిలో, సంఘంలో మన కళ్ళముందు కనపడతున్న అనర్థకాలను ఎత్తి చూపటం. మతము, నీతి, మొదలైన విషయాలలో కనపడుతున్న దురాచారాలు, మూఢ విశ్వాసాలు చూపి వాటివల్ల సంఘానికి ఎటువంటి కీడు కలుగుతున్నదో చూపి ప్రజలను హెచ్చరించటం. ఆదే విధంగా ప్రభుత్వోద్యోగులలోని లంచగొండితనాన్ని, న్యాయశాఖ,

రక్షకశాఖ మొదలైన వాటిలో కనపడే అన్యాయాలను అక్ర మాలను అవినీతి పనులను బహిరంగం చేసి వాటికి పాల్పడ్డ ప్రబుద్ధులు తలవంచుకొనేట్లు చేయడం తమ ఆదర్శమని ప్రకటించారు వీరేశలింగం.

భాషవల్ల ప్రయోజనం అది నలుగురికీ సులభంగా తెలిసేట్లు ఉంటేనే సిద్ధిస్తుంది. ఒక్క పండితులకు మాత్రమే పనికి వచ్చేట్లుంటే దానివల్ల లోకానికి ఆట్టే ప్రయోజనం ఉండదు. కాబట్టి వీలైనంత సులభ శైలిలో రచనలు చేయాలి అని నిశ్చయానికి వచ్చారాయన. ఇదివరకు తెలుగులో పద్య కావ్యాలు చాలా ఉన్నాయి. మళ్ళీ పద్యకావ్యాలు, ప్రబం ధాలు వ్రాసినందువల్ల అధికంగా ప్రయోజనం ఏముంటుంది? కాబట్టి ప్రజలకు పనికివచ్చేట్లు దేశ చరిత్ర, భూగోళం, శాస్త్ర విజ్ఞానం, మొదలైనవి వచనంలో ఉండాలి. ప్రజలలో కన పడుతున్న చెడు నడతను గూర్చి కూడా తెలియజెయ్యాలి అని నిశ్చయించుకున్నారు వీరేశలింగం పంతులుగారు. ఆ విధం గానే వివేక వర్ధనిని నడపటం సాగించారు. ఒకవైపున భాషను అభివృద్ధికి తెస్తూనే మరొకవైపున ఉద్యోగులలో లంచగొండితనం, పెద్ద మనుషులలో వేశ్యలపట్ల ఆదరణ మొదలైన అక్రమాలను రూపుమాపటానికి కూడా వీరేశలింగం కృతనిశ్చయు లైనారు. ఆ రోజుల్లో రక్షకభటులు సామాన్య ప్రజలను భయపెడుతూ వాళ్ళ నుంచి డబ్బు గుంజటానికి

ప్రయత్నిస్తూ ఉండేవాళ్ళు. రక్షకభటులు అమాయకులను బెదిరించటం, ఉద్యోగస్థులకు, ధనవంతులకు ఆడుగులకు మడుగులొత్తడం బట్టబయలుచేస్తూ వివేకవర్ధని వార్తలు ప్రకటించేది. ఈ విమర్శలకు గురి అయినవాళ్ళు వివేకవర్ధనిపై కక్ష కట్టే వాళ్ళు. ఏదో ఒక విధంగా ఆ పత్రికను రూపుమాపాలనీ, పత్రికా సంపాదకుడిపై సమయం సమకూడితే దౌర్జన్యం కూడా చేయాలనీ ఆలోచించే వాళ్ళు. ఆ పత్రిక విరోధివర్గానికి బాగా పురి ఎక్కించి న్యాయ స్థానాలలో ఆ పత్రికపై మాన నష్టం వ్యాజ్యాలు కూడా తీసుకొనివచ్చే వాళ్ళు. అయితే వివేకవర్ధని వీటన్నిటికేమీ జడుసుకునేది కాదు. నిర్భయంగా సంఘంలోని చెడుగులను వెల్లడించేది. ఆ రోజుల్లో వాలేస్ అనే దొర రాజమండ్రికి డిస్ట్రిక్ట్ జడ్జిగా వచ్చారు. ఆయన బోళా మనిషి. అప్పట్లో న్యాయవాదులు కావటానికి ప్రత్యేకించి పరీక్షలేవీ ఉండేవి కావు. పెద్ద పెద్ద ఉద్యోగులు, అంతకుపూర్వం న్యాయవాదవృత్తి అవలంబించి కోర్టులలో కేసులు నడుపుతున్న వాళ్ళు సిఫారసు చేస్తే ఏ వ్యక్తికైనా న్యాయవాదిపట్టా ఇవ్వటానికి వీలుండేది. అందువల్ల పెద్దమనుషులు డబ్బు పుచ్చుకుని అనర్హులైన వాళ్ళకు కూడా న్యాయవాది పట్టా లివ్వవచ్చు నంటూ సిఫార్సులు చేస్తూ వచ్చారు. వాలేస్ దొరగారు ఇవేవీ పట్టించుకోకుండా అక్షరం ముక్క రానివాళ్ళకు కూడా న్యాయవాద

పట్టాలు ఇవ్వడం సాగించాడు. అప్పుడు వివేకవర్ధని పత్రిక ఆ అక్రమాన్ని అరికట్టటానికి తీవ్రంగా వాలేస్‌ను విమర్శిస్తూ పత్రికలో ఆయా ఉదాహరణలతో సహా ప్రకటించింది. దీనితో ఊళ్ళో పెద్ద సంక్షోభం బయలుదేరింది. మద్రాసులో ఉన్నత న్యాయసభ (హైకోర్టు) దృష్టికి వచ్చింది ఈ అక్రమం. ప్రభుత్వం దృష్టికి కూడా వచ్చింది. అప్పుడిక విచారణ జరిపించి వాలేస్ అక్రమంగా పట్టాలిచ్చిన వాళ్ళందరి పట్టాలు రద్దు చేసింది ఉన్నతన్యాయస్థానం. దాంతో క్రొత్తగా ప్లీడరు దుస్తులు కుట్టించుకున్న వాళ్ళు, డబ్బు పెట్టి న్యాయవాది పట్టాలు కొనుక్కున్న వాళ్ళూ లబోదిబో మన్నారు.

ఆ రోజుల్లో రాజమండ్రికి పోలూరి శ్రీరాములు అనే ఆయన డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా వచ్చాడు. ఈయన లంచాలు పుచ్చుకొవడంలో ఆరితేరిన వాడు. కోర్టులో న్యాయాన్ని ఆవును వేలం వేసినట్లు బహిరంగంగా వేలం వెయ్యగల సమర్థుడు. అది కాక ఈయనకు రాజమండ్రిలో మరొక సౌకర్యం కూడా చిక్కింది. అప్పట్లో గవర్నమెంటు ప్లీడరైన చిత్రపు కామరాజుగారు శ్రీరాములుగారికి దగ్గర బంధువే అయినాడు. శ్రీరాములుగారి చెల్లెల్ని కామరాజుగారి కొడుక్కు పెళ్ళి చేయడం వల్ల ఈ బంధుత్వం మరింత పెనవైచుకుంది. శ్రీరాములుగారు రాజమండ్రిలో ఉన్న ఉద్యోగ కాలంలో ఎంత వీలైతే అంత సంపాదించాలని దురాశకు గురి అయినారు.

అందువల్ల రోజూ ఎక్కువ సంఖ్యలో కేసులు విచారణ చేసేవారు. అన్ని వ్యాజ్యాలలో తీర్పు వ్రాయడానికి తనకు సమయం చిక్కదు కాబట్టి రహస్యంగా చిత్రపు కామరాజు గారిచేత కొన్ని వ్యాజ్యాలకు తీర్పులు రాయించేవాడు. కోర్టులో బహిరంగంగా ప్లీడర్లు తామిచ్చే లంచాన్ని గోప్యంగా 100 ప్రకరణం, 200 ప్రకరణం అని సూచిస్తుండేవాళ్ళు. అంటే తమ పక్షాన తీర్పు ఇస్తే ఆ డబ్బు లంచంగా ఇస్తామని సూచ్యార్థంగా చెప్పడమన్నమాట అది. ఒక రోజున కోర్టుకు వెళ్ళి రహస్యంగా వెనక కూచోని ఈ తతంగ మంతా చూసి వచ్చాడు వీరేశలింగం. ఈ జరుగుతున్న అన్యాయమంతా, కపటనాటక మంతా వివరంగా వివేక వర్ధనికి ఎక్కించాడు. ఆయనపైన ఇటువంటి తీవ్రమైన ఆరోపణలు చేసినందుకు కోర్టువారు కేసు పెట్టారు. అప్పుడు డిస్ట్రిక్టు జడ్జి వాలేసు దొరగారే. ఆయనముందే ఈ కేసు విచారణకు వచ్చింది. వివేకవర్ధనిలో జరుగుతున్న వ్యవహారాన్ని అయితే ఉన్నదున్నట్లు ప్రకటించారు కాని చిత్రపు కామరాజుగారు శ్రీరాములుగారికి తీర్పులు రాసిపెడుతున్నట్లు రుజువుచేయడం ఎట్లా? రుజువు చెయ్యక పోతే వీరేశలింగానికి జైలు శిక్ష కూడా పడవచ్చు.

చిత్రపు కామరాజుగారి వీథి ఊడ్చే పనిమనిషిని బతిమిలాడి కామరాజుగారింట్లోంచి వీథిలో పారవేసే చిత్తుకాగితాల ముక్కలు సంపాదించాడు వీరేశలింగం. రాత్రింబగళ్ళు కష్టపడి

ఆ ముక్కలన్నీ ఒకదానితో ఒకటి జతచేస్తూ పరిశీలిస్తూ రెండు మూడు తీర్పులు కుదిరేట్లు సాధించ గలిగాడు. కోర్టులో కేసు విచారణకువచ్చి వీరేశలింగం పని ఇక అంతటితో సరిఅనుకుం టున్న సమయంలో తన జేబులో దాచితెచ్చిన కామరాజుగారి చేతివ్రాత తీర్పును జడ్జిగారి సమక్షంలో ఉంచాడు. శ్రీరాములు గారు, కామరాజు కలసి ఆడుతున్న అన్యాయపు నాటకం రుజు వైంది. జైలుశిక్ష తప్పించుకునేందుకుగాను చిత్రపుకామరాజు గారు ఆరాత్రికి రాత్రే ఆత్మహత్య చేసుకున్నారు. శ్రీరాములు గారు కుడా అవమానం భరించలేక మంచమెక్కారు. ఆ తర్వాత 5,6 నెలల్లోనే ఆయన కుడా మరణించారు. ఇదంతా 1878వ సంవత్సరంలో జరిగింది. గవర్నమెంటు ప్లీడరు ఆత్మహత్యతో ఒక రాజమండ్రే కాదు, ఆంధ్రదేశమంతా అలజడి చెందింది. వివేకవర్ధని పేరు చెబితే చాలు లంచ గొండి ఉద్యోగులకు, అక్రమంగా ప్రవర్తించే వారికి గుండెల్లో బెరుకు పుట్టింది. ప్రభుత్వోద్యోగుల్లో ఎవరు అవినీతికి పాల్పడ్డా వివేకవర్ధని పత్రిక వాళ్ళ దుర్మార్గం బట్టబయలు చేసేది. తమ పక్షమని, విరోధి పక్షమని, బంధువని, స్నేహితుడని చూసేది కాదు. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు వీరేశలింగానికి పాఠశాలలో గురువే. ఆయన సంఘ సంస్కార విషయాలు వీరేశలింగానికి బోధించిన వాడే. అయితే ఆయన ఉపాధ్యాయ వృత్తి విడిచి పెట్టి న్యాయ శాస్త్రపరీక్షలు ప్యాసై రాజమండ్రికే

డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా వచ్చి చిన్నచిన్న అక్రమాలు చేయడం సాగించగా, అవి చిన్నవైనా పెద్దవైనా అక్రమాలే కాబట్టీ, అనినీతి పనులే కాబట్టీ ఆయన గూర్చి ప్రహసనాలు రాసి వివేకవర్ధనిలో ప్రకటించాడు వీరేశలింగం. దానితో గురువుగారితోనే గుద్దులాడవలసి వచ్చింది వీరేశలింగానికి. "నాకు నెయ్యంకంటే న్యాయం ప్రియమైనది" అని నిర్భయంగా ప్రకటించాడు వీరేశలింగం.

సంఘంలో స్థితిమంతులంతా, పెద్ద పెద్ద ఉద్యోగస్థులంతా వేశ్యలను ఉంచుకొనేవాళ్ళు ఆ రోజుల్లో. ఇంట్లో ఏ శుభకార్యం జరిగినా వేశ్యల ఆట పాటలు ఏర్పాటుచేసేవాళ్ళు. ఆ కార్యక్రమానికి తక్కిన ఉద్యోగస్థుల్నీ, ఊళ్ళోని పెద్దల్నీ ఆహ్వానించేవారు. అధికారుల ఆహ్వానం కాబట్టి వెళ్ళకుండా ఉండటానికి భయపడేవాళ్ళు ఇతరులు. వెళితే ఏ కట్నమో, కానుకో అక్కడ విధిగా చెల్లించాలి. ఈ దుర్మార్గమంతా పత్రికలో పదే పదే బహిరంగం చేసి ఆ ఘనులు సిగ్గుపడేట్లు చేసి భోగం మేళాలను, ఆ మేళాలలో 'వాసగులు' అంటే కట్నకానుకలు చెల్లించే దురాచారాన్ని నశింపచేశాడు వీరేశలింగం. అందువల్ల వేశ్యాప్రియులు, వేశ్యలు వీరేశలింగంగారికి విరోధపక్ష మైనారు. అయినప్పటికీ సంఘంలో ఒక దుర్నీతిని, దురాచారాన్ని ఆయన అణచి వేయగలిగాడు. సంఘదురాచారాలు అణచివేయటానికి ఆయనకు

వివేకవర్ధని పత్రిక వజ్రాయుధం లాగా పని చేసింది. సుమారు 20 సం॥లు ఆయన ఆ పత్రిక నడిపారు. తెలుగులో ప్రహసరచన ప్రారంభించింది వీరేశలింగమే. సంఘంలోని అన్యాయాలను, అక్రమాలను, అవినీతిని ఖండించటానికే ఆయన ప్రహసనాలు రాశాడు.

పత్రిక ఆయన చేతిలో తిరుగులేని ఆయుధం, బలమైన సాధనం అయింది.

## ఆనాటి సాంఘిక పరిస్థితులు

సంఘంలో విద్యావంతుల సంఖ్య చాలా తక్కువగా ఉండేది. కాయకష్టం చేసుకొని జీవించాల్సిన వాళ్ళే ఎక్కువ మంది ఉండేవాళ్ళు. పల్లెటూళ్ళలో వ్యవసాయమే ముఖ్యవృత్తి. క్రమక్రమంగా చేతివృత్తులు క్షీణిస్తున్న రోజులు. ఇంగ్లీషు చదువుకుంటే ఉద్యోగాలు వస్తాయని పల్లెలనుంచి మధ్యతరగతి పై కుటుంబాలవాళ్ళు ఇంగ్లీషు పాఠశాల లున్న పట్టణాలకు ఎగ బాకుతున్న రోజులవి.

ప్రజల్లో అమాయకత్వం ఎక్కువగా ఉండేది. ఎటు వంటి అసందర్భాన్నైనా నమ్మేవాళ్ళు. దేవతలు, గుళ్ళు గోపు రాల్లు, ఉత్సవాలు, వీటిమీద నమ్మకం ఎక్కువగా ఉండేది.

సాంక్రమిక రోగాలు, వ్యాధులు వచ్చినప్పుడు గ్రామ దేవతలు కోపించారని, వాళ్ళకు కొలువులు చేయాలని, శాంత పరచాలని ప్రజలు భావించి ఆ ప్రయత్నాలు చేసేవాళ్ళు. అకాల మరణాలు, సరిఅయిన వైద్య సౌకర్యాలు లేకపోవడం, ఒక ఊరి నుంచి ఇంకో ఊరుకు వెళ్ళడానికి తగిన ప్రయాణ సాధనాలు లేకపోవడం, సాధారణంగా స్త్రీ పురుషుల ఆయుఃప్రమాణం తక్కువగా ఉండటం, ఆరోజుల లక్షణాలుగా ఉండేవి.

వైద్య సౌకర్యాలు లేకపోవడం వల్ల మానసిక రోగాలు ఎక్కువగా ఉండేవి. విద్య లేకపోవడం వల్ల, బయట ప్రపంచం ఎక్కువగా తెలియక పోవడం వల్ల స్త్రీలలో మానసిక వ్యాధి తీవ్రత ఎక్కువగా ఉండేది. అతి బాల్య వివాహాలవల్ల, బాల్య వైధవ్యం వల్ల నిరర్థక జీవన భయాందోళనల వల్ల సంఘంలో ముఖ్యంగా స్త్రీలలో దయ్యాల, భూతాలను గురించి నమ్మకం ఎక్కువగా ఉండేది. స్వార్థపరులు, దుష్టులు తమ ప్రయోజనం కోసం సంఘంలో ఈ దయ్యాల భూతాల నమ్మకాలను ఇంకా ఎక్కువగా వ్యాపింపజేస్తూ ఉండేవాళ్ళు. "ఆ కాలంలో దయ్యాలున్నాయని నూటికి తొంభైమంది నమ్మే వాళ్ళు. స్త్రీలలో దయ్యం పట్టని వాళ్ళు ఎక్కడో కాని ఉండేవాళ్ళు కారు. ఎవరికైనా ఏదైనా జబ్బు చేయగానే వైద్యుడి ఇంటికి పోవటానికి బదులు భూత

వైద్యుడి ఇంటికో, సోదె చెప్పేవాళ్ళ ఇంటికో పరుగులు తీస్తూ ఉండే వాళ్ళు. ఎవరి ఇంటిలోనైనా పురుషుడు మరణించినా, స్త్రీ చనిపోయినా వాళ్ళు దయ్యాలై తిరుగుతున్నట్లు ఎవరైనా అంటే సర్వసామాన్యంగా అందరూ నమ్మేవాళ్ళు" అని వీరేశలింగం తన జీవిత చరిత్రను తానే రాసుకొంటూ ఆ పరిస్థితులను వివరించాడు.

వీరేశలింగంగారి కాలం నాటికి బాల్యవివాహాలు సర్వసాధారణంగా జరుగుతుండేవి. ఐదారేళ్ళ వయసుననే ఆడ పిల్లలకు పెళ్ళిళ్ళు అయిపోవాలని అందరూ ఆరాటపడుతుండే వాళ్ళు. మూడు నాలుగేళ్ళ వయసు పిల్లలకు కూడా పెళ్ళిళ్ళు చేయటం ఉండేది. కొన్ని సందర్భాలలో అయితే ఏడాది పిల్లలకు కూడా పెళ్ళిళ్ళు చేసేవాళ్ళు. అదికాక పెళ్ళికూతురికీ పెళ్ళికొడుక్కూ వయస్సులో చాలా తేడా ఉంటూ ఉండేది. ఒక్కొక్క సందర్భంలో అయితే ముప్పై ఏళ్ళు, నలభై ఏళ్ళు వరకు కూడా ఉండేది. ఆడపిల్లలు పెరిగి పెద్దవాళ్ళై అత్త వారింటికి వెళ్ళవలసిన సమయానికి ఎంతమందికో వైధవ్యం ప్రాప్తించేది. అందువల్ల ఇటు పుట్టింటి వారికి అటు అత్తింటి వాళ్ళకు తీరని దుఃఖం కలుగుతుండేది. ఏ ఇంట్లో చూసినా బాలవితంతువులు కనపడుతుండే వారు. వాళ్ళు వీధిలోకి అడుగు పెట్టకూడదు. చదువుకోవటానికి వీల్లేదు. మగపిల్లలు చదువు

కోవటానికే పాఠశాలలు లేని రోజుల్లో ఆడపిల్లలకు పాఠశాల లెక్కడివి? వాళ్ళ చదువు గూర్చి ఎవరు పట్టించు కుంటారు?

ఇదికాక డబ్బు తీసుకుని తమ చిన్నపిల్లలను ముసలి వాళ్ళకు కట్టబెట్టేవారు తల్లిదండ్రులు. దీన్ని కన్యాశుల్కం తీసుకోవట మనేవాళ్ళు. అంటే డబ్బు తీసుకొని పిల్లను అమ్ము కోవడ మన్నమాట. ఆ విధంగా అరవై ఏళ్ళవాళ్ళు, డెబ్బైఏళ్ళ వాళ్ళు కూడ మగ వాళ్ళు మూడేళ్ళు నాలుగేళ్ళ ఆడపిల్లలను కొనుక్కోగలిగేవాళ్ళు.

గురజాడ అప్పారావుగారు రాసిన పుత్తడిబొమ్మ పూర్ణమ్మ కథ ఇటువంటిదే కదా! నెనరూ న్యాయం విడిచిపెట్టి కాసుకోసం ముదుసలి మొగుడికి పూర్ణమ్మను ముడి వేశారు అని గురజాడ అప్పారావుగారు ఎంతో విషాదంగా ఆ కథ రాశారు. అట్లానే కన్యాశుల్కం అనే నాటకంలో కన్యాశుల్కం వల్లా, పసిపిల్లలను ముసలివాళ్ళకిచ్చి వివాహం చేయడం వల్లా కలిగే అనర్థాలను చక్కగా చిత్రించారు. 'అమ్ముకున్నా నమ్ముకున్నానని ప్రతివాళ్ళూ నన్ను దెప్పిపొడుస్తారు. కూర గాయలా అమ్ముకోవటానికి ఆ డబ్బు తీసుకున్నాను కనుక సరి పోయింది. మొగుడు చచ్చాడుకదా ఆ డబ్బు తీసుకోకపోతే ఇప్పుడు దీన్ని పోషించడం ఎట్లాననుకున్నావు' అని బావ మరిది కర్కటకశాస్త్రి పైన గంయిమని లేస్తాడు అగ్నిహోత్రావ

ధాన్లు కన్యాశుల్కం నాటకంలో. అప్పుడు కరటకశాస్త్రి అంటాడు కదా 'బావా, చచ్చాడంటావు, అతడి తప్పేముంది. మంచంమీంచి దించెయ్యడానికి సిద్ధంగా ఉన్నవాడికి కట్టబెడి తివి పిల్లను' అంటాడు. గురజాడ అప్పారావుగారు విజయ నగరం చుట్టుపట్ల ఆ రోజుల్లో జరిగిన కన్యాశుల్కం వివాహాలు గురించి ఆరా తీశారు. మూడేళ్ళలో జరిగిన పెళ్ళిళ్ళ లెక్కలు తయారుచేశాడు. 5 సం॥ల లోపు వయసు పిల్లలకే 1044 మందిదాకా పెళ్ళిళ్ళు జరిగాయి అని చూపాడు. దీన్ని భరించ లేకనే ఆయన కన్యాశుల్కం నాటకం రాశాడు.

ఇటువంటి చిన్నపిల్లలకు జీవితంలో మరి ఆశగాని, ఆసక్తిగాని, సంతోషం కాని ఏం ఉంటాయి? వాళ్ళకు మనో వ్యాధి పట్టుకోవటంలో వింత ఏముంది? ఇటువంటి మనో వ్యాధులను దయ్యం పట్టటంగా భ్రమించేట్లు చేసి భూతవైద్యులు కపటనాటకా లాడేవాళ్ళు. రకరకాలుగా డబ్బు గుంజేవాళ్ళు. గురజాడ అప్పారావు రాసిన కన్యాశుల్కం నాటకం లోనూ, వీరేశలింగం పంతులుగారి రాజశేఖరచరిత్రం లోనూ ఈ భూతవైద్యుల మాయోపాయాలన్నీ, కపటాలన్నీ విపులంగా వర్ణించి ఉండడం చూడవచ్చు.ముసలివాళ్ళకు చిన్నపిల్లల నిచ్చి పెళ్ళి చేయడంవల్లనే ఈ దుఃఖాలన్నీ కలుగుతున్నాయని గ్రహించకనో, గ్రహించికూడా మూర్ఖత్వం చేతనో అటువంటి దురాచారం మానుకోకుండా గ్రహచారమనీ, దేవుడనీ, దయ్యా

మనీ, కర్మ అనీ, వాళ్ళ ప్రారబ్ధమనీ మూర్ఖ వాదనలు చేసేవాళ్ళు ఆనాటి పెద్దలు.

ఈ బాధలు చాలక ప్రతి ఉళ్ళోనూ వేశ్యలుండేవాళ్ళు. ఈ వేశ్యలను చేరదీయడం గొప్ప అనీ, గౌరవం అనీ, హోదా అనీ ఆనాటి కాస్త కలవారి కుటుంబాల మగవాళ్ళు అంతా అనుకొనేవాళ్ళు. అధికారస్థులైతే, ఉద్యోగస్థులయితే అది ఒక దర్జా అని అనుకొనేవాళ్ళు. కుటుంబ స్త్రీలు కుమిలిపోవాల్సిందే తప్ప పల్లెత్తు మాట అనటానికి వీలుండేది కాదు. ఎప్పుడూ తమ వ్రతాలు, మడి బట్టలూ, పూజలూ వీటితోనే పొద్దు పుచ్చుతుండేవాళ్ళు. ఎవరైనా పెద్దమనిషి వేశ్యనుంచుకోకపోతే అది పౌరుషహీనంగా ఎంచేవాళ్ళు. ఈ వేశ్యలు సంగీతం, నాట్యం నేర్చుకునేవాళ్ళు. ఎవరింట్లోనైనా ఏదైనా శుభకార్యం జరిగినప్పుడు ఈ వేశ్యల సంగీత నాట్య ప్రదర్శనలు ఏర్పాటు చేసేవాళ్ళు. మన ఇళ్ళలో ఇప్పుడు ఏదైనా వ్రతమో, శుభకార్యమో జరిగితే ఇప్పుడు బంధువుల్ని, స్నేహితుల్ని ఆహ్వానిస్తున్నట్లుగా ఆ రోజుల్లో ఏ స్థితిమంతుడైనా, పెద్ద అధికారి అయినా ఏదో ఒక సందర్భాన్ని బట్టి 'భోగంమేళాలు' ఏర్పాటు చేసినప్పుడు బంధువుల్ని, ఊళ్ళోని పెద్దలను తోటి ఉద్యోగులను తన కింద ఉద్యోగులను అందరినీ ఆహ్వానించేవాళ్ళు. వాళ్ళు ఇటువంటి 'మేజువాణీ'లకు వొట్టి చేతుల్తో రావటానికి వీలు లేదు. ఏదైనా కానుక తెచ్చి ఆ ఆటకత్తెకో, పాటకత్తెకో

ఇవ్వాల్సి ఉండేది. పేదఉద్యోగులు పై అధికార్లనుంచి మాట వస్తుందన్న భయంతో చెంబోతప్పేలోనో తాకట్టుపెట్టి అయినా ఒకటో రెండో రూపాయలు తెచ్చి ఇటువంటి ప్రదర్శనలలో కట్నం చెల్లించేవాళ్ళు. ఈ విధంగా కానుకలు, కట్నాలు చెల్లించటాన్ని వసూళ్ళు అని, వొసగులివ్వటం అనీ అనేవాళ్ళు.

ఇదీకాక పెళ్ళిళ్ళు మొదలైన శుభకార్యాలప్పుడు ఆడవాళ్ళు మగవాళ్ళు మోటు సరసాలాడుకునేవాళ్ళు. భోజనాలకు పిలిస్తే ఒక పట్టాన వచ్చేవాళ్ళుకారు. మూడుసార్లు నాలుగుసార్లు పిలిపించుకునే వాళ్ళు. ఆ పెద్దలెవరో వచ్చిందాకా వడ్డించి సిద్ధంగా ఉన్నా భోజనాలు చేయటానికి వీల్లేదు.

పెళ్ళిళ్ళలో సంబంధాలు కుదర్చటానికి తప్పుడు జాతకాలు బనాయించటం సర్వసాధారణంగా జరుగుతుండేది. చదువుకున్నవాళ్ళు కూడా పుణ్యం, పాపం, నీతి, నియమం పట్టించుకునేవాళ్ళుకారు స్వార్థం దగ్గరకు వచ్చేటప్పటికి.

ఇవన్నీ చాలక ఉద్యోగస్థులలో లంచగొండితనం కూడా ఎక్కువగా ఉండేది. అక్షరజ్ఞానం లేని పల్లెటూరి ప్రజలను పోలీసుశాఖ వాళ్ళు బాగా పీడించుకు తింటూ ఉండేవాళ్ళు. ఇక కోర్టులలో న్యాయవాదులు పార్టీల దగ్గర బాగా డబ్బు గుంజుకుంటూ ఉండేవాళ్ళు.

ఎవరింట్లోనైనా ఎవరైనా చనిపోతే నలుగురూ సాయం చేయటానికి వచ్చేవాళ్ళు కారు. శవాన్ని స్మశానానికి తీసుకొని పోవటానికి కూడా బేరాలు మొదలెట్టేవాళ్ళు.

ఇక మతబోధ చేయటానికి ఊళ్ళు పర్యటించే స్వాములవార్లు కూడా నీతి, న్యాయం, ధర్మం దయాదాక్షిణ్యం సంఘంలో సక్రమంగా జరుగుతున్నాయా లేదా అని చూడకుండా తమ పాదపూజలు, పొట్టపూజలూ ముఖ్యమని భావించేవాళ్ళు. వాళ్ళు కూడా ప్రజలను పీడించేవాళ్ళు. అప్పట్లో స్వాములవార్లకు సంఘంలో ఎవరైనా సరిగా నడుచుకోకపోతే వాళ్ళను బహిష్కరించే అధికారం ఉండేది. వాళ్ళకు జుల్మానా వేసి అది రాబట్టుకునే అధికారం ఉండేది. స్వాములవారు వేసే శిక్షను 'వెలి' అనేవాళ్ళు. వెలిపెట్టడమంటే సంఘంలో తక్కిన వాళ్ళెవరూ ఎటువంటి సాయం చేయకుండా నిషేధించడమన్నమాట.

ఇటువంటి దుర్మార్గాల నన్నిటినీ ఎదుర్కొన్నాడు వీరేశలింగం.

## సంఘ సంస్కరణ కృషి

ఏ ఇంటిలో చూసినా ఆడపిల్లల ఆర్తనాదాలు విని భరించలేకపోయినాడు వీరేశలింగం. పుత్రాచార్యుల ఆర్యా

టాలు చూసి సహించలేక పోయాడు. వేశ్యల పీడ చూసి నిగ్రహించుకోలేక పోయాడు. అధికారుల లంచగొండితనం తేలిగ్గా తీసుకోలేక పోయినాడు. పురోహితుల మాయలు, మంత్రాలు, కపటాలు చూసి ఓర్చుకోలేక పోయినాడు. భూతవైద్యుల మాయోపాయాలు, మోసాలు చూసి కోపగించుకున్నాడు. సంఘంలోని ఈ దుర్మార్గాలన్నిటినీ రూపుమాపాలని ఆయన నడుం కట్టుకున్నాడు. ఇంకా బాల్య వివాహాలపై ధ్వజమెత్తి యుద్ధానికి సన్నద్ధుడైనాడు.. ఒకవైపున సంఘ శరీర వ్యాధికి తగిన చికిత్స చేస్తూనే, ఆరోగ్యానికీ, బలానికీ, పుష్టికీ కావలసిన ఔషధాలు కూడా ఇస్తూనే వచ్చాడు.

స్త్రీలు చదువుకుంటే కాని సంసారాలు సరిగా ఉండవు అని స్త్రీల కోసం ముఖ్యంగా బాలబాలికల కోసం ఆయన పాఠశాలలు ప్రారంభించాడు. వాళ్ళకు ఆయనే స్వయంగా చదువు చెప్పేవాడు. అట్లానే బాలురకు కూడా సరైన విద్య నేర్పడానికి పాఠశాలలు స్థాపించాడు. సంఘంలో ధర్మం, దయ, నీతి, ఆస్తికత, పరోపకారం, చిత్తశుద్ధి, శీలం, సత్ప్రవర్తన అలవరచటానికి రాజమండ్రిలో బాలబాలికల పాఠశాలను ఆయనే మొదట స్థాపించాడు. ఆడపిల్లలు మగపిల్లలూ కలసి చదువుకునే సహవిద్యావిధానం ఆంధ్రదేశంలో అమలు పరచినవాడు ఆయనే. అంతేకాదు సంఘానికి వెలిత్తు

చదువు సంధ్యలకు నోచుకోక ఎన్నో కష్టాలనుభవిస్తూ, కనాకష్టాలపాలై, అంటరానివాళ్ళని సంఘం చీదరించుకుం టున్న, ఈసడించుకుంటున్న వారి పిల్లలను కూడా తన పాఠ శాలలో చేర్చుకుని వాళ్ళకు అంటరానితనం తొలగించాడు వీరేశలింగం. పాఠశాల తరగతులలో వాళ్ళను వేరుగా కూచోబెట్టకుండా అందరితో కలిపే కూచోబెట్టేవాడు. అటు వంటి అట్టడుగు వర్గాల పిల్లల దగ్గర బడిజీతం వసూలు చేసే వాడు కాడు. వాళ్ళకు పుస్తకాలు, పలకా బలపాలు కూడా ఉచితం గానే అందజేసేవాడు.

ఆడపిల్లల చదువంటే ఆయనకు అమితమైన అను రాగం. ఏ ఊళ్ళో ఉన్నా, ఏ నగరంలో ఉన్నా తన తీరు బాటుకాలమంతా ఆడపిల్లల చదువు గురించే ఆలోచించే వాడాయన. వీలైతే అక్కడొక బాలికా పాఠశాల స్థాపించే వాడు. తానే సుద్దముక్క, పుస్తకమూ పట్టుకుని వాళ్ళకు పాఠాలు చెప్పేవాడు.

సంఘంలో ఇది మంచి, ఇది చెడ్డ, ఇట్లా నడచుకుంటే మేలు కలుగుతుంది, ఇట్లా ప్రవర్తిస్తే కీడు కలుగుతుంది అని నలుగురూ కలిసి చర్చించుకోవటానికీ, ఆలోచించుకోవటానికీ, తీర్మానించటానికి అనువైన సమావేశ స్థలాలు ఉండేవి కావు ఆ రోజుల్లో. అసలు సమాజాలు స్థాపించి పనిచేయటం కూడా

ఆ రోజుల్లో ప్రజలకు తెలియదు. ఆంధ్రదేశంలో విద్యార్థి సంఘాలు స్థాపించినవాడు, సాంఘిక కృషి సమాజాలు స్థాపించినవాడూ వీరేశలింగమే. అంతేకాదు, ఆంధ్రదేశ మంతటిలో మొదటి పురమందిరం సొంత డబ్బు ఖర్చుపెట్టి కట్టించినవాడాయనే. ఆ పురమందిరంలో అన్ని మతాలవారు కూడా సమావేశాలు జరుపుకోవచ్చునని ఆయన నియమ నిబంధనల్లో పేర్కొన్నాడు. తక్కిన మతస్థులను కూడా ఆ పురమందిర వ్యవహారాలు చూసే ధర్మకర్తల మండలిలో సభ్యులుగా ఆయన నియమించాడు.

రాజమహేంద్రవరంలో ముస్లిం పిల్లల హాస్టలుకు వీరేశలింగం పంతులుగారు 'వార్డెను'గా ఉండేవారు. ఆ మతస్థులైన పెద్దలు ఆయన్ను కోరగా అందుకు ఆయన ఒప్పుకున్నారు.

ఏ ఇంట్లోనైనా ఎవరికైనా కష్టంవస్తే ఇరుగుపొరుగు వాళ్ళు ముఖ్యంగా కులంవాళ్ళు సహాయం చెయ్యాలని ఆయన ప్రబోధించాడు. యుక్తవయస్సు రానిదే ఆడపిల్లలకు పెళ్ళి చేయకూడదని ఆయన నచ్చచెప్పాడు.

భోగంమేళాలు ఏర్పాటు చేయడం, 'వాసగులు' ఇవ్వడం జరగకుండా చాలా కృషి చేశాడు. ఉద్యోగస్థుల లోని అవినీతిన్ని, లంచగొండితనాన్ని రూపుమాపటానికి, కులాభి

మానం పోగొట్టటానికీ తన పత్రిక ద్వారా చాలా ప్రచారం చేశాడు వీరేశలింగం. చెడుగా నడచుకొనే పెద్దమనుషులను గూర్చి, ఉద్యోగస్థులనుగూర్చి ప్రహసనాలు రాసి వాళ్ళను భయపెట్టాడు. అదుపులో ఉంచాడు.

అన్నిటికన్నా ఆయన చేసిన గొప్పపని ఒకటి ఉన్నది. ముక్కుపచ్చలారని వితంతువులకు మళ్ళీ పెళ్ళి చేయడం అది. ఎనిమిదేళ్ళకి పదేళ్ళకో భర్తను పోగొట్టుకుని వైధవ్యం పాలైతే జీవితాంతం వాళ్ళట్లానే బతుకును ఈడ్చుకోవాల్సి ఉండేది ఆరోజుల్లో. ఇది క్రూరం అనిపించింది వీరేశలింగానికి. వాళ్ళ పాపం ఏమిటి? వాళ్ళ తప్పు ఏముంది? ఎందుకు వాళ్ళపాలిట ఈ శాపం? అని ఆయన చాలా బాధపడ్డాడు. అదీకాక ఆరోజుల్లో పై తరగతి కుటుంబాలలో మరీ దారుణమైన ఆచారం ఉండేది. అదేమిటంటే భర్తను పోగొట్టుకున్న ఆడపిల్లలకు తలజుట్టు తీయించివేసే వాళ్ళు. వాళ్లు మంచిబట్ట కట్టుకోవటానికి కానీ, పేరంటాలలో, శుభకార్యాలలో నలుగురితో కలసి ఉండటానికి కానీ, మరికొన్ని ఏళ్ళు వచ్చిన తర్వాత మంచి భోజనం చేయడానికి కానీ వీలుండేది కాదు. ఉప్పిడులు ఉపవాసాలతో ఎంతగా కాలక్షేపం చేస్తే అంతగా మంచిది, అదే పుణ్యం, అదే ధర్మం అని వాళ్ళకు బోధించేవాళ్ళు.

వీరేశలింగం ఈ దుర్మార్గం భరించలేక పోయాడు. అట్టివంటి అభాగినులకు మళ్ళీ పెళ్ళి చేస్తానని పూనుకొన్నాడు.

సంఘంలో పై తరగతుల వాళ్ళు ఆయనపై కత్తి కట్టారు. విరోధిగా చూశారు. ఆయన్ను వెలివేశారు. అయినా ఆయన ఏ మాత్రమూ జంకలేదు. మరి అలాంటి వితంతువులను పెళ్ళి చేసుకోవటానికి ఎవరు ముందుకు వస్తారు? తన దగ్గర చదువు కుంటున్న యువకులకు, తన దగ్గరకు వచ్చి అభిమానించే వాళ్ళకు ఆయన బోధించాడు.

అటువంటి పెళ్ళిళ్ళు చేయడానికి స్థలం ఎవరిస్తారు? ఖర్చులెవరు పెట్టుకుంటారు? సహాయం ఎవరుచేస్తారు? భోజనాలకు ఎవరు వస్తారు? ఆదరంగా ఏవరు చూస్తారు? ఇవన్నీ సమస్యలే అయినాయి. అయినా ఆయన ఏమాత్రం భయపడ లేదు.

మొట్టమొదట్లో ఆయన ఈ వివాహాలు చేయించడానికి పూనుకొన్నప్పుడు కళాశాలలో ఆయన దగ్గర చదువుకున్న విద్యార్థులు ఆయనకెంతో అండగా ఉన్నారు. ఆయన ఏ పని చెప్పినా చేసుకొని వచ్చేవాళ్ళు. ఆయన తన ఇంట్లోనే ఈ పెళ్ళిళ్ళు చేసేవాడు. ఆయనపైన ప్రతిపక్షులు దౌర్జన్యం చేయకుండా ఉన్నతాధికారులు, పోలీసు భటులూ ఆయన ఇంటిచుట్టూ వుండి రక్షణ కల్పించే వారు. పైడా రామకృష్ణయ్య, ఆత్మూరి లక్ష్మీనరసింహం, బసవరాజు గవర్రాజు మొదలైనవాళ్ళు మొదటి మొదటి

వివాహాలలో ఆయనకెంతగానో సాయం చేశారు. వీరేశలింగం పంతులుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు ఆయనతో సర్వ విధాల సహకరించింది. ఆమె బంధువులు ఎంతగా బోధించినా, బాధించినా పంతులుగారివైపే వున్నది కాని ఆయన్ను విడిచిపెట్టి పోలేదు. ఆయనకు ఎటువంటి కష్టమూ కలిగించ లేదు.

వితంతు వివాహాలు మొదలెట్టి ఐదో వివాహం జరుగు తుండగా వంటవాళ్ళు, నీళ్ళవాళ్ళు మరి ఇతర సహాయకులూ ఎవరూ మేం రామని కట్టుకట్టారు. అప్పుడు రాజ్యలక్ష్మమ్మ గారే స్వయంగా గోదావరికి వెళ్ళి నీళ్ళు తెచ్చుకుని పెళ్ళివారికి వంటచేసిపెట్టాల్సి వచ్చింది. అయినా ఆ తల్లి అందుకు ఏ మాత్రమూ బాధపడలేదు. విసుక్కోలేదు.

1881 వ సంవత్సరం డిసెంబర్ 11వ తేదీన వీరేశ లింగం పంతులు, రాజ్యలక్ష్మమ్మగారలు తమ ఇంట్లో మొట్ట మొదటిసారిగా వితంతు వివాహం చేశారు. కృష్ణాజిల్లాలో తిరువూరు తాలూకాలో రేపూడి అనే ఊరు నుంచి ఎనిమిది తొమ్మిదేళ్ళ బాలవితంతువును రాజమండ్రికి తెచ్చారు. వరుడు గోగులపాటి శ్రీరాములుగారు. వధువు పేరు గౌరమ్మ.

ఈ పెళ్ళితో రాజమండ్రిలో పెద్ద ఆందోళన బయలు దేరింది. ఈ పెళ్ళి చూడటానికి వెళ్ళిన.వాళ్ళను, వీరేశలింగం

గారి ప్రయత్నం పట్ల సానుభూతి చూపినవాళ్ళను, వాళ్ళు అద్దె ఇళ్ళలో ఉంటే ఆ ఇళ్ళనుంచి యజమానులు వెళ్ళగొట్టారు. వాళ్ళకు వుప్పూ నిప్పూ అందకుండా జేశారు. అటువంటి వాళ్ళు తప్పైందని ప్రాయశ్చిత్తాలు చేసుకొని మత గురువులు విధించిన షరతులకు వొప్పుకొని వాళ్ళు ఇవ్వాలని చెప్పిన దండన, రుసుం చెల్లించి మళ్ళీ స్వసంఘంలో కలవాల్సి వచ్చింది.

కాకినాడ పురవాస్తవ్యుడైన పైడా రామకృష్ణయ్యే అనే సంఘ సంస్కరణాభిమాని ప్రతిసారి వితంతు వివాహం జరిగినప్పుడు వెయ్యి రూపాయలు ఇస్తానని వాగ్దానం చేశాడు, మొదటి వివాహాలకు ఆయన ఆ వాగ్దానం చేసిన డబ్బు ఇచ్చారు.

మొదటిసారి వితంతు వివాహం చేసినప్పటి నుంచి వీరేశలింగం పంతులుగారు అటు తర్వాత తాము జీవించిన సుమారు 40 సం॥ల కాలంలో సుమారు నలభై దాకా వితంతు వివాహాలు నిర్వహించారు.

## వీరేశలింగం గొప్ప రచయిత

ఆయన పుట్టిన శతాబ్దంలో వీరేశలింగం రచించినన్ని గ్రంథాలు రచించిన మరో రచయిత లేనే లేడు. ఆయనలో

పదోవంతు గ్రంథాలు రాసినవాళ్ళు కూడా వేళ్ళ మీద లెక్కబెట్ట గలిగినంతమంది మాత్రమే ఉన్నారు. ఈ శతాబ్దంలో కూడా గ్రంథరచనలో వీరేశలింగం పంతులుగారితో పోల్చదగ్గ రచయితలు ఏ ఇద్దరో ముగ్గురో మహా అయితే నలుగురో ఉన్నారో లేరో !

వీరేశలింగం పంతులుగారు చిన్నవీ, పెద్దవీ కలిపి నూట ముప్ఫై గ్రంథాలకు మించి రాశారు. ఏభై సంవత్సరాల వ్యవధిలో నూట ముప్ఫైకి మించిన గ్రంథాలు రచించడమూ, ప్రచురించడమూ అంటే సామాన్యమైన విషయంకాదు. ఇట్లా ఇన్ని గ్రంథాలు రచిస్తూనే ఆయన నాలుగు పత్రికలు కూడా నడిపాడు. ఇరవై ఏళ్ళు నడిచిన పత్రిక ఒకటుండగా, తక్కిన పత్రికలు ఆయన నాలుగైదేళ్ళు మాత్రమే నడపగలిగాడు.

చిన్న పిల్లలు చదువుకోవటానికి ఆ కాలానికి పుస్తకాలు లేవు. అందువల్ల బాలబాలికలకు పనికి వచ్చేట్టు నీతి కథలు, పద్యాలు, పాటలు ఆయన రాశాడు. తెలుగులో బాలసాహిత్యం ప్రారంభించింది వీరేశలింగం పంతులుగారే. అదే విధంగా స్త్రీలు చదువుకొని సులభంగా అర్థం చేసుకుని ఆనందించటానికి పనికి వచ్చే పుస్తకాలు ఆనాడు లేవు. అందువలన స్త్రీల కోసం ప్రత్యేకించి ఆయన ఒక పత్రిక నడిపాడు. ఆ పత్రిక పేరు సతీహిత బోధిని. ఈ పత్రికలో ఆయన చిత్ర

విచిత్రమైన కథలు, పాటలు, పద్యాలు, బొమ్మలతో సహా నీతి కథలు ప్రచురించే వారు.

వీరేశలింగం పంతులుగారు చాలా గొప్ప పండితుడు. గొప్ప కవి. అసలు ఆయన పేరును వీరేశలింగ కవి అనే వ్యవహరించే వాళ్ళు మొదట్లో. రాజమండ్రిలో ఉన్న ఆధునిక కవిత్రయంలో ఆయనను ఒకడిగా పరిగణించారు ఆనాడు. ఆయన చేసినంత వచన రచన ఆయన పుట్టిన శతాబ్దంలోనే కాదు కదా ఈ శతాబ్దంలో కూడా ఎవరూ చేయలేదు. ఆయన కొన్ని వేల పుటలకు సరిపడే వచనం రాశాడు. ఆయనకు 'గద్య తిక్కన' అనే బిరుదు ఉంది. అంటే తిక్కన కవి ఎన్ని వేల పద్యాలు రాశాడో, ఆ పరిమాణంలో వీరేశలింగం కవి వచనం రాశాడన్నమాట. అంతేకాకుండా, తెలుగు పద్యానికి తిక్కన ఎంత తెలుగు తేటతనం కూర్చాడో, తెలుగు వచనానికి వీరేశలింగం పంతులు అంత తేట తెలుగుతనం కూర్చాడని అర్థం.

ఆయన గొప్ప పండితుడు కదా. మొదట్లో ఆ కాలపు పండితులను మెప్పించాలని చాలా గంభీరమైన రచనలు చేశాడాయన. తన గొప్పతనాన్ని, తన ప్రత్యేకతను చాటుకోవడానికి ఆయన అట్లా చేశాడు. ఆయన రచనలు చూసి పండితు

లంతా ఎంతో మెచ్చుకున్నారు. ఆయన ప్రతిపక్షులైన పండితులు కూడా ఆయన్ను ఎంతో పొగిడారు.

చదువుకుంటున్న రోజుల్లోనే రెండు శతకాలు రచించాడు వీరేశలింగం. అయితే అవి అటు తర్వాత దొరకలేదు. ఆ తర్వాత అచ్చ తెలుగు కావ్యాలు రాశాడు. అంటే సంస్కృత పదాలు రాకుండా కావ్య రచన చేయడమన్న మాట.

ఆ తర్వాత ఆయన దృష్టి పూర్తిగా మారిపోయింది. భాషవల్ల, రచనలవల్ల జనసామాన్యంలో తెలివితేటలు వృద్ధి కావాలికదా. నడవటానికి దేవుడు కాళ్ళిచ్చాడు గదా తల కిందికీ కాళ్ళు పైకీ పెట్టి నడవడం ఎందుకు ? జన సామాన్యంలో విజ్ఞానం వృద్ధిచేయటానికి వచన రచన పనికివచ్చినట్లు, పద్య రచన అంత ప్రయోజనం కలిగించదు. అందువల్ల అటు తర్వాత ఆయన వచన రచనలే ఎక్కువ చేశాడు.

ఆయన మెట్రిక్యులేషన్ వరకు ఇంగ్లీషు చదువుకున్నాడు కదా ! ఇంగ్లీషు సాహిత్యంలో వివిధ రకాలైన రచన లుండటం ఆయన చూశాడు. కథలు, నవలలు, సాహిత్య విమర్శ, జీవిత చరిత్ర, ఉపన్యాసం, ప్రహసనం, కవుల చరిత్ర, ఆత్మకథ, చిన్నపిల్లల పుస్తకాలు, శాస్త్ర గ్రంథాలు, ఇవన్నీ ఇంగ్లీషు సాహిత్యంలో వుండటం ఆయన

చూశాడు. మరి తెలుగులో మాత్రం వుండవద్దా అని ఆయనకు అనిపించింది. అందుకని వాటన్నిటినీ తెలుగులో కూడా రచించడానికాయన ప్రయత్నించాడు. ప్రహసనం అంటే నవ్వు పుట్టించే రచన తెలుగులో మొదటిసారిగా రచించింది వీరేశలింగం పంతులుగారే.

నన్నయ్య, తిక్కన, ఎర్రాప్రెగడ, శ్రీనాథుడు, పోతన, అల్లసాని పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామ కృష్ణుడు వంటి గొప్ప గొప్ప కవులు తెలుగులో ఎంతోమంది వున్నారు. అయితే వాళ్ళు ఏ కాలంలో వుండే వారో, ఏ ప్రాంతం వాళ్ళో, తల్లిదండ్రుల పేర్లు ఏమిటో మనకు అది వరకు తెలిసేది కాదు. అందువల్ల వీరేశలింగం పంతులు గారు ఆంధ్రకవుల చరిత్ర అనే గ్రంథం రచించారు. రెండు వందలమందికి పైగా కవులను గూర్చి వాళ్ళ జీవిత విశేషాలను గూర్చి, వాళ్ళు రాసిన గ్రంథాలను గూర్చి ఎన్నో వివరాలు సేకరించి ఈ కవుల చరిత్ర రాశాడాయన. ఇందుకోసం ఆయన మద్రాసు, తంజావూరు వెళ్ళి అక్కడ తాళపత్ర గ్రంథాలుంటే వాటిని కూడా సంప్రదించి ఎన్నో వివరాలు సమకూర్చు కున్నారు.

ఆయన రాసిన గ్రంథాలు ఆ రోజుల్లోనే ఇంగ్లీషు లోకి కూడా అనువాదం పొందాయంటే అది ఒక గొప్ప

సంగతి. ఆయన రాసిన నవల రాజశేఖరచరిత్ర ఇంగ్లీషు లోకి అనువాదం కాగా ఆ రోజుల్లో ఇంగ్లండులో వెలువడే లండన్ టైమ్స్ పత్రిక ఆ నవలను మెచ్చుకొంది.

కొన్ని షేక్స్పియర్ నాటకాలను వీరేశలింగం తెలుగు లోకి అనువదించాడు. అట్లానే కాళిదాస మహాకవి నాటకాలను కొన్నిటిని ఆయన తెలుగులోకి తెచ్చాడు. షెరిడన్ అనే సుప్రసిద్ధ ఇంగ్లీషు నాటక రచయిత నాటకాలు రెండింటిని వీరేశలింగం తెలుగులోకి తెచ్చాడు.

ఆలివర్ గోల్డుస్మిత్ అనే గొప్ప రచయిత ఇంగ్లీషులో రాసిన 'వికర్ ఆఫ్ వేక్ ఫీల్డు' అనే నవల ఆధారంగా పూర్తిగా తెలుగుతనంతో రాజశేఖరచరిత్ర అనే తెలుగు నవల రాశాడాయన. జొనాథన్ స్విఫ్ట్ అనే గొప్ప ఇంగ్లీషు నవలా రచయిత రచించిన 'గల్లివర్స్ ట్రావెల్స్' అనే వినోద కరమైన నవల ఆధారంగా 'లంకాద్వీపం' 'ఆడుమలయాళం' అనే రెండు భాగాల నవల రచించాడు వీరేశలింగం. ఈ నవలలో ఆయన ఎంతో హాస్యాన్ని చొప్పించాడు. ఆనాడు మన సంఘంలో కనపడుతున్న అనేక దురాచారాలను, మూర్ఖాభిప్రాయాలను, ఛాందసభావాలను, సంకుచిత సంప్ర దాయాలను ఎద్దేవా చేస్తూ, హేళన చేస్తూ, వేళాకోళంచేస్తూ ఈ నవల రచించాడాయన.

ఇంగ్లీషులో ఛార్లెస్ ల్యాంబ్ అనే రచయిత షేక్స్పియర్ నాటక కథలను వచనంలో రాస్తే ఆ గ్రంథం ఆధారంగా తెలుగు వాతావరణం కల్పిస్తూ తెలుగు పేర్లు తెలుగు ఊళ్ళు సృష్టించి ఆయన ఆ షేక్స్పియర్ నాటక కథలను వచనంలో రచించాడు. ఆడపిల్లలు పాడుకోవటానికి ప్రత్యే కంగా పాటలు రాశాడాయన. బడిపిల్లలకు వాచక పుస్తకాలు రాశాడు. పాఠశాల విద్యార్థులకు వ్యాకరణ విషయాలు సుల భంగా తెలిపే కోరికతో వ్యాకరణం రచించారు పంతులుగారు.

ముందు కాలం వాళ్ళకు తన కాలంనాటి పరిస్థితులు ఉన్నది వున్నట్లుగా తెలియడానికీ, సంఘం బాగుపడాలంటే అందుకు కొందరు పూనుకొని ఏ విధంగా కృషి చేయాల్సిందీ, ఎటువంటి కష్టాలనైనా ధైర్యంగా ఎదుర్కోవాల్సిందీ తెలియ జేయడానికి స్వీయ చరిత్ర అంటే తన జీవిత చరిత్రను తానే రాసుకున్నాడా మహానుభావుడు. తెలుగులో వచ్చిన మొట్ట మొదటి స్వీయ చరిత్ర ఇదే. ఇంత గొప్ప గ్రంథం తెలుగులో మరి లేదు అన్నా అనవచ్చు. కిందటి శతాబ్దం రెండో భాగంలో ప్రారంభమై ఈ శతాబ్ది మొదటి ఇరవై సంవత్సరాలు గడిచే వరకు మూడు తరాల తెలుగు వారి జీవితం ఏ విధమైన మార్పులకు గురి అయిందో వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్ర తెలియజేసినంత మరే ఇతర గ్రంథమూ తెలియ జేయలేదు.

తన కాలంలో తాను మెచ్చిన మహా పురుషుల జీవిత చరిత్రలు కూడా ఆయన రాశాడు. తెలుగులో మొట్ట మొదటి సారిగా జీవిత చరిత్ర రచనా ప్రయత్నం చేసిన వాడాయనే. విక్టోరియా మహారాణి జీవిత చరిత్ర రచించారు పంతులు గారు. అట్లానే సుప్రసిద్ధ సంఘ సంస్కర్త, యుగపురుషుడు అయిన రాజా రామమోహన్‌రాయల వారి జీవిత చరిత్ర పంతులుగారు రచించారు. అట్లానే క్రీస్తు ప్రభువు చరిత్ర కూడా జీసస్ చరిత్రం పేరుతో ఆయన రచించారు.

సుప్రసిద్ధ సంఘసేవా పరాయణులైన మహిళామణుల చరిత్రలు కూడా ఆయన రచించారు.

ఆరోజుల్లో ఆయన నడిపించిన పత్రికలు వివేకవర్ధని' సతీహిత బోధిని, సత్యసంవర్ధిని, సత్యదూత అనేవి. చింతామణి, తెలుగు జనానా అనే పత్రికలతో కూడా ఆయనకు సన్నిహిత సంబంధం ఉండేది. ఈ పత్రిక లన్నిటి లోనూ అయన రచనలు చేసేవాడు. 1893 వ సంవత్సర నుంచి ప్రారంభించి చింతామణి పత్రికలో తెలుగులో నవలా రచన పోటీలను నిర్వహించినప్పుడు ఆ నవలల పోటీకి వచ్చిన నవలల న్యాయనిర్ణేతగా కూడా ఉండేవారు పంతులుగారు.

ఆయన సంఘ సంస్కరణ విషయంలో కాని సాహిత్య రంగంలో కాని చేసిన కృషి కంతా సహాయ సహ

కార ప్రోత్సాహాలు అందించిన తమ ఇల్లాలి రాజ్యలక్ష్మమ్మ గారి పట్ల గల గౌరవంతో ప్రేమతో అభిమానంతో స్వీయ చరిత్రను ఆమెకే అంకితం చేశారు పంతులుగారు.

## వీరేశలింగం సందేశం

వీరేశలింగం తెలుగువాళ్ళను, తెలుగు దేశాన్ని తెలుగు సాహిత్యాన్ని, తెలుగువాళ్ళ సంస్కారాన్ని, తెలుగు వాళ్ళ చరిత్రను, తెలుగు వ్యక్తిత్వాన్ని ఎంతగానో ప్రేమించాడు. అందుకోసమే వాళ్ళను ఉద్ధరించటానికి ఎంతో తపన పడ్డాడు. కోపగించుకున్నాడు. బుజ్జగించి చెప్పాడు. ప్రబోధించాడు.

తెలుగు సాహిత్య వికాసం కోసం ఎంతగానో కృషి చేశాడు. తెలుగు సాహిత్యంలో అదివరకు లేని ఎన్నో శాఖలను తాను సృష్టించాడు. తాను జీవించి ఉన్న సంఘపు బాగోగులు గూర్చి పట్టించుకోవలసిందిగా ప్రతి విద్యావంతుణ్ణీ ఆయన హెచ్చరించాడు.

పనిచేయకుండా వట్టిమాటలు చెపుతూ కాలక్షేపం చేసేవాళ్ళంటే ఆయనకెంత మాత్రమూ గిట్టేది కాదు. ఎప్పుడూ ఏదో ఒక పనిలో ఆయన నిమగ్నుడై ఉండేవాడు. కాలాన్ని వ్యర్థంగా గడపవద్దని ఆయన అందర్నీ హెచ్చరించే వాడు

"పనిచేసి చూపవలయునన్న చింతయేకాని నన్ను గూర్చి నేను చెప్పుకోవలయునన్న యభిలాషము మొదటి నుండి నాకంతగా లేకుండెను" అని స్వీయ చరిత్ర ప్రారంభిస్తూ చెప్పారాయన.

"లోకములో ప్రతి పురుషుడును తన పక్షమే వాస్తవము కావలెనని కోరుచుండును గాని తాను సత్యమయిన పక్షమున యుండవలెనని కోరడు" అన్నాడాయన. అంటే సత్యమైన పక్షంలోనే మనం ఎప్పుడూ నడచుకోవాలని ఆయన ప్రబోధించాడు.

"లోకములో నేది కాని యారంభము లోనే పెద్దదిగా నున్నది లేదు. వస్తు విషయమెట్లో పనుల విషయము నట్లే మొదట కొంచెముగా నారంభమయి క్రమ క్రమముగా పెరిగి కడపట మహత్తరమైన దగును" అన్నారు పంతులు గారు. కాబట్టి సత్కార్యాచరణంలో నాకు సహాయులెవ్వరూ లేరే, సాధన సంపత్తి లేదే అని ఉపేక్షతో ఉండకూడదు. పని ప్రారంభించి చిత్తశుద్ధితో చేస్తూ ఉంటే ఫలితం తప్పకుండా పొందవచ్చునని ఆయన తన జీవితంద్వారా రుజువు చేశారు.

"దేశాభివృద్ధి కలగటానికి విద్యావిషయంలో, మత విషయంలో, వ్యవహార విషయంలో, కులాచార విషయంలో, నీతి విషయంలో నానా ముఖాల" పనిచేయాలని ఆయన హెచ్చరించారు.

"పూర్వాచారాలను భూషించటం, నూతనాచారాలను దూషించటం దేశాభిమానం కాదు. దేశానికి భంగకరంగా ఉన్న దురాచారాలను తొలగిస్తూ క్షేమకరాలుగా ఉన్న సదాచారాలను నెలకొల్పుతూ దేశాభివృద్ధికి పాటుపడటమే నిజమైన దేశాభిమాన"మని నూరేళ్ళకిందటే ఆయన తన పత్రిక వివేకవర్ధని ద్వారా తెలుగు ప్రజలకు హితవు చెప్పారు.

"విద్యాధికులు మూఢులకు దారి చూపటానికి సాహసించకుండా తామే మూఢుల దారిలో నడుస్తున్నంతకాలం దేశంయొక్క దౌర్భాగ్యం వదలదు" అని నూరేళ్ళ కిందటే ఆయన చెప్పారు.

"పూర్వకాలమునం దించుమించుగా నన్ని దేశములలోను బలవంతులు బలహీనులను, ధనికులు బీదలను ప్రబలనీయక అణచివేయుట సహజ కృత్యముగా నుండెను. నాగరకత హెచ్చిన కొలదిని ఇప్పుడు బహుదేశములయందు సాధారణ జనుల స్వాతంత్ర్యములు చక్కగా కాపాడబడుచు వచ్చుటచేత వారి పరిస్థితియు బాగు పడుచున్నది.

"దేశమును మంచి దశకు తీసుకొని వచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కెడు దేశములలో నొకదానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్య జనుల యొక్క స్థితిని బాగు చేయుటకు ప్రయత్నపడవలెను" అని 1880 లో అంటే నూటి

ఎనిమిది సంవత్సరాల కిందటే ప్రజాస్వామ్య వ్యవస్థ కావాలని కోరుకున్నారు పంతులుగారు.

వ్యక్తి స్వాతంత్ర్యం ఎంత అవసరమో గుర్తించారు పంతులుగారు. వధూవరులు పరస్పరాంగీకారంతో పెళ్ళి చేసుకోవటం ఉత్తమ మన్నారు పంతులుగారు. బాల్య వివాహాలు కూడదన్నారు. ఇష్టపడితే స్త్రీ పునర్వివాహం దోషం కాదని అన్నారు.

చదువుకున్నవారు ఏ వృత్తిలో ప్రవేశిస్తే ఆ వృత్తికి గౌరవం కలుగుతుందన్నారు. ప్రతివారూ ప్రభుత్వోద్యోగాల కోసం పాకులాడకుండా కృషి వాణిజ్యాదు లవలంబించాలని 1880 లోనే వివేకవర్ధనిలో పంతులుగారు రాశారు. తక్కిన దేశాలలో ప్రభుత్వంవారి కొలువు కన్నా కృషి వాణిజ్యాలకే ఎక్కువ గౌరవముందన్నారు పంతులుగారు.

"సమస్తానర్థములకును మూలమయిన త్రాగుబోతు తనమును నాగరకాగ్రగణ్యులైన ప్రభుత్వమువారు ప్రోత్సాహ పరచుచుండుట కంటే నవమానకరమైన కార్యము మరియొకటి యుండదు" అని 1882వ సంవత్సరంలోనే ఆనాటి ఆంగ్లేయ ప్రభుత్వాన్ని నిరసించారు పంతులుగారు. అప్పటి ప్రభుత్వాన్ని ఈ విధంగా హెచ్చరించారు కూడా.

"నీతి రక్షణ పరాయణులైన దొరతనం వారు పదే పదే విచారించి రాబడి తక్కువై పోతుందన్న ఆలోచన మాని జనుల నీతికీ, క్షేమానికీ భయంకరంగా ఉన్న సురాపానం నిరుత్సాహపరచి క్రమక్రమంగా తగ్గించటానికి ప్రయత్ని స్తారని నమ్ముతున్నాము' అని 1883వ సంవత్సరం వివేకవర్ధని పత్రిక ద్వారా ఆనాటి ప్రభుత్వాన్ని కోరారు పంతులుగారు. ఎంత శక్తిమంతుడైనా, ఎంత మేధావి అయినా నీతి తప్పి ప్రవర్తిస్తే తనకూ లోకానికీ ఏమీ మేలుకలగదు అని చెప్పారు పంతులుగారు.

నూరు మాటలు చెప్పే దానికన్నా ఒక మంచి పని చేసి చూపటం అధిక ప్రయోజనం కలిగిస్తుంది అని పదేపదే బోధించారు పంతులుగారు.

మన దేశంలో విద్యా నిపుణులు అనేకులు కలరు గాని తదనుగుణ మయిన సద్వర్తనం కల వారంతగా లేరు అని బాధపడ్డారు పంతులుగారు. 'దేశాభివృద్ధి అంటే దేశంలో ఉండే జనుల అభివృద్ధే కాని వేరే కాదు. నిజమైన దేశాభి మానం గల వారందరికీ జనుల యొక్క స్థితిని బాగుచేయ టానికి ప్రయత్నించటం విధి.'

'మన దేశంలో లెక్కలేని జాతిభేదము లేర్పడి నానా టికి జనులలో పరస్పర ద్వేషం ప్రబలుతుండటం వల్ల హిందూ

దేశంలో ఇప్పుడు దేశాభిమానమే పూర్తిగా చచ్చిపోయింది' అని 1881లోనే వీరేశలింగం పంతులుగారు వివేకవర్ధని పత్రికలో తమ బాధను వ్యక్తం చేశారు పంతులుగారు.

జనులలో విద్య వ్యాపించాలనీ, ప్రజ తమహక్కులను గూర్చి తాము తెలుసుకోవాలనీ, స్వేచ్ఛగా బ్రతకాలనీ ప్రబోధించారు పంతులుగారు.

వీరేశలింగం పంతులుగారు నిశ్చయంగా మహాపురుషులు అని గురజాడ అప్పారావుగారనడంలో అంతరార్థం ఆయన చేసిన సంఘసంస్కరణకృషేనని వేరే చెప్పాలా?!

## ముగింపు

భారతదేశంలో కిందటి శతాబ్దంలో ఎందరో మహాపురుషులు జన్మించారు. దక్షిణ భారతదేశంలో జన్మించిన మహాపురుషులలో విశిష్టమైన వ్యక్తిత్వం కలవారు వీరేశలింగం పంతులుగారు.

ఆయన 1848వ సంవత్సరం ఏప్రిల్ 16 ఆదివారం రాజమండ్రిలో జన్మించారు. డెభ్భైఒక్క సంవత్సరాలు జీవించారు. సుమారు 25 సం॥లు ఉపాధ్యాయవృత్తిలో గడిపారు.

ఆయన గొప్ప సాహిత్య వేత్త.

సంఘసంస్కారోద్యమ నాయకుడు.

సంస్థా నిర్మాత.

తన అరవయ్యో ఏట తన యావదాస్తిని తన ఆశయ ప్రచారంకోసం తాను నిర్మించిన సంస్థలు ముందు ముందు పని చేయడం కోసం, తన గ్రంథప్రచురణ నిమిత్తం హితకారిణీ సమాజం అనే ధర్మ సంస్థను స్థాపించి దానిపరంగా సమాజానికి ఇచ్చి వేశారు.

తన సమాధిపైన కేవలం "ఏకేశ్వర విశ్వాసి" అని మాత్రమే లిఖించాల్సిందిగా ఆయన కోరాడు. అంతకన్న వేరే ఏమీ వివరించ వద్దన్నాడు.

ఆయన నమ్మినదానిని ముందుగా ఆచరించి చూపాడు.

సాహిత్యాన్ని సంఘసంస్కరణకు సాధనంగా చేసుకొని ఆయన రచనలు చేశాడు. "భాషవలని ప్రయోజనమేమి? జనులు తమ యభిప్రాయముల నొండొరులకు దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి? తమ భావములను దూరముననున్నవారికిని రాబోవు తరముల వారికిని సులభముగా తెలుపుట.

గ్రంథములెట్లుండవలయును? అందరికి దెలియునట్లు సులభముగా నుండవలెను" అని స్వీయ చరిత్రలో సాహిత్య ప్రయోజనాన్ని కూర్చి చెప్పారు పంతులుగారు.

ఆయన కాలంలో ఆయనంత సులభశైలిలో వచన రచనం చేసిన వాళ్ళూ, ఆయన రాసినంత వచనం రాసిన

వాళ్ళు మరొకరు లేరు. ఆయన లాగా ఒకవైపున సంఘ సంస్కారకృషి చేస్తూ సాహిత్యకృషి చేసిన వాళ్ళు మరొకరు లేరు. ఆయనలాగా మహిళల ఉన్నతికోసం పాటుపడ్డవారు మరొకరు లేరు. ఆయనలాగా తన సర్వస్వాన్ని సమాజానికి ఇచ్చివేసినవాళ్ళు మరొకరు లేరు.

అందుకే

"వీరేశలింగంవంటి సంఘ సంస్కర్త, అటువంటి ధైర్యశాలి, అటువంటి కార్యశూరుడు, అటువంటి స్వార్థత్యాగి, అటువంటి లోకోపకారపరాయణుడు కొన్ని వందల సంవత్సరములకుగాని మన దేశమున జన్మింపడని నా దృఢమైన విశ్వాసము" అని చిలకమర్తి లక్ష్మీనరసింహం ఆయనకు జోహార్లు అర్పించారు.

1948 వ సంవత్సరంలో ఆంధ్రదేశంలో ఆయన శత జయంతి ఉత్సవాలు జరిగాయి. ఆయన తెలుగుదేశంలో పుట్టి ఇప్పటికి నూటనలభై సంవత్సరాలు గడిచాయి. శత జయంతి సందర్భంగా పెద్దలాయన కీ విధంగా జోహార్లు అర్పించారు.

సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు వీరేశలింగం పంతులుగారి నిట్లా స్తుతించారు.

"దక్షిణ భారతదేశంలో సంఘంలో హేతువాదబద్ధమైన మార్పులకోసం పనిచేసిన తొలి మార్గదర్శకులలో

వీరేశలింగం పంతులుగారొకరు. క్రాంతదర్శకులైన పథ నిర్దేశకు లందరి వలెనే ఆయన అపార్థాలకు, హింసలకు గురి అయినాడు. ఆయనవలెనే అవహేళనను ముప్పును కూడా సాహసంతో ఎదిరించి సాంఘిక నవావతరణం కోసం పాటు పడిన ఆయన ఋణం మనం తీర్చుకోవాలి! ఆనాటి సుప్రసిద్ధ విద్యావేత్త శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి వీరేశలింగం పంతులు గారి దివ్యస్మృతికి ఈ విధంగా అంజలి ఘటించారు.

"వీరేశలింగం పంతులుగారి వంటి దేవతలను భారత దేశ మెప్పుడు మరిచిపోయిన అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైన దనియే చెప్పవచ్చును. పంతులుగారివంటి ధైర్యము, ఉత్సాహము, కార్యశూరత మనదేశీయులలో నెప్పుడు నాటగలమో అప్పుడే పంతులుగారి చిహ్నమును స్మరింప గలిగిన వారమగుదుమని నా అభిప్రాయము."

వీరేశలింగం పంతులుగారు తమ జీవితకాలంలో చిట్ట చివరి శ్వాస తీసుకొనే వరకూ కాలం వృథా చేయలేదు. తన జాతి జనులకు మేలు కలిగించే, ఉత్తేజం కలిగించే పనులను చేస్తూనే ఉన్నారు. ఆయన ఇంకా కొంత సేపటిలో ఇహలోకం విడిచి పెడతా రనగా కూడా కవుల చరిత్ర ప్రూఫులు దిద్దుతూనే ఉన్నారు. కవుల చరిత్రను సవరించి అనేక నూతనాంశాలను చేర్చి విపుల పరచి ముద్రించాలనే ఉద్దేశంతో ఆయన మద్రాసు వెళ్ళి అక్కడ తమ మిత్రులైన కొమర్రాజు లక్ష్మణరావుగారి

దగ్గర బస చేసి ఉండగా ఆయన చివరి ఘడియలు సమీపించాయి. లక్ష్మణరావుగా రప్పుడు బసచేసిన భవనాన్ని 'వేద విలాస భవనం' అనేవారు. మద్రాసు ఎగ్మూరులోని ఈ వేద విలాస భవనంలో 1919 మే 27 వ తేది వీరేశలింగం పంతులుగారు కాలంలో కలిసిపోయారు.

అంతకు పూర్వం తొమ్మిదేళ్ళ కిందటే 1910 వ సంవత్సరం ఆగస్టు నెల 12వ తేదీ ఆయన ఇల్లాలు రాజ్యలక్ష్మమ్మగారు రాజమండ్రిలో స్వర్గస్థులైనారు. ఆనాటి నుంచి ఆయన ఒంటరిగా ఏకాకిగా అసహాయుడిగా జీవించారు. కరుణాపూరితమైన ఈ అసహాయ దశనంతా ఆయన స్వీయ చరిత్రలో వర్ణించుకున్నారు.

వారు రాజమండ్రిలో బహుకాలం నివసించిన ఆనంద ఉద్యానవనంలో రాజ్యలక్ష్మమ్మగారి సమాధి వక్కనే వీరేశలింగం పంతులుగారి సమాధికూడా ఏర్పాటు చేశారు.

వీరేశలింగం పంతులుగారి సమాధిమీద చిలకమర్తి వారి ఈ పద్యం ఈనాటికీ కనపడుతుంది.

'తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా!'

